# తెలుగులో అతిథిపదాలు

డా॥ జి. వి. పూర్ణచందు B.A.M.S.,

ప్రచురణ:

శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్టు

మచిలీపట్నం - 521 001

తెలుగులో అతిథిపదాలు

# Persian, Arabic & Portuguese Loan words in Telugu

Complied by :
**Dr. G.V.Purnachand,** B.A.M.S.,

**First Edition : 10 Febuary, 2018**

**Price : Rs. 40/-**

Cover Design :
**Artist Ramu**

Type Setting :
**Madhulatha Graphics**, Vijayawada.

Printer :
**Sri Chaitanya Offset Printers**
Vijayawada - 2.

*Published by :*
**Smt. Guttikonda Ramaratnam Charitable Trust,**
Gruha Priya Foods, Ramanaidupet Centre,
Machilipatnam - 521 001. Cell : 9440167697.

*For copies :*
**Dr. G.V. Purna Chand**
Satnam Towers,Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada-2.. Mobile : 94401 72642.

# అరువు పదాలు కావివి, అతిథిపదాలు

**అ**రువు ఊరికే పుట్టదు. ఏదైనా తాకట్టు పెట్టి తీసుకోవాలి. లేదా చేబదులుగా తెచ్చుకోవాలి. కానీ, ఒక సంపన్న భాషలోంచి పదాలను మనం బదులుగా తిరిగి ఇవ్వకుండానే పూర్తి ఉచితంగా తెచ్చుకుంటున్నాం. ఒక భాషా పదాన్ని ఇంకో భాషీయులు ఉన్నది ఉన్నట్టుగా తమ భాషలోకి స్వీకరించి అదే అర్థంలో ఉపయోగిస్తున్నపుడు, 'దాతభాష' నుండి స్వీకర్త భాషలోకి వచ్చిన 'అన్య దేశ్యాలను' 'అరువు పదాలు' (Foreign Loan words) అనటంకన్నా అతిథి పదాలంటే సబబుగా ఉంటుంది.

నిజానికి, ఋణమాఫీ చేస్తే తీరే అప్పుకాదిది. అరువు అరువే! అన్నం, పుస్తకం లాంటి సంస్కృత పదాలను తెలుగు పదాలుగా వాడుకున్నట్టే, రైలు, రోడ్డు, ఫ్యాను, బ్యాంకులాంటి ఆంగ్లపదాలు కూడా తెలుగువారి హక్కు భుక్తాలుగా మారిపోయాయి! అరువు ఎవరిచ్చారు? దానం ఎవరు చేశారు...? చాలా విదేశీ భాషా పదాలను అవి మనవి కావని తెలీకుండానే మన అవసరాలకు వాడేస్తున్నాం. వాటికి కాపీ రైటు చట్టం వర్తించదు కాబట్టి. వాటిని తెలివి మాటలుగా స్వీకరించగలగటమే హుందాతనం అవుతుంది.

మనం ఏ భాషా పదాన్ని తెచ్చుకున్నా ఇముడ్చుకోగలిగే సహిష్ణుత తెలుగు భాషకు ఉంది. కాబట్టి, ఏ అరువు పదం అయినా అది అతిథి పదం లాగా వచ్చి సహకరిస్తుంది.

రసాయన చర్యలో పాల్గొనకుండా రసాయన చర్యని నడిపించే ఉత్ప్రేరకం (కెటలిష్టు) లాంటిది ఈ అతిథి పదం. అది మన భాషా కుటుంబంలోది కానప్పటికీ, మనదే నన్నంతగా మన భాషలో కలిసిపోతుంది. దాన్ని ఉపయోగించుకోగలిగే చాకచక్యం సంభాషించే వాడి చాకచక్యం మీద ఆధారపడి ఉంటుంది.

బస్సెక్కి వచ్చాను, రైలొచ్చేసింది, ఫ్యానేశాను, రోడ్డెక్కింది ఇలా పలకటానికి దేశీ, విదేశీ మీమాంస జనానికి అక్కర్లేదు. అవతలి వ్యక్తికి అర్థం కావటమే సంభాషణకు పరమావధి కాబట్టి, మాట్లాడేప్పుడు దేశీయమా- విదేశీయమా అనేది అప్రస్తుతం అవుతుంది.

తెలుగులో సంస్కృత, పాళీ, ప్రాకృత భాషాపదాలు కొల్లలుగా ఉన్నాయి. అవికాక అరబ్బీ, పారసి, ఉర్దూ, పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి పదాలు మరిన్ని మన జనం నాలుకల మీద యథేచ్ఛగా ఆడుతున్నాయి. బ్రిటిష్ వాళ్లు కోస్తాంధ్ర, సీమ ప్రాంతాలను

పొంది పాలనా బాధ్యతలు తీసుకున్నా, పాలనా పరిభాషను చాలా వరకూ ఆ నాడు అమలులో ఉన్న అరబ్బీ, పారసీక పదాలను మాత్రమే కొనసాగించారు.

ఈ పాలనా పదాలకు ఇంగ్లీషులో చాలావాటికి సమానార్థకాలు లేవు. అందుకని రెవెన్యూ, పోలీసు తదితర శాఖల్లో స్వాతంత్ర్యం వచ్చాక కూడా తెలుగు ప్రభుత్వాలు నిజాం నాటి పదజాలాన్నే కొనసాగించారు. నిత్యవ్యవహారంలో అతిసాధారణంగా మనం వాడుకునే రోజు, మైలు, సాలు, ఇస్త్రీ, జబ్బు, సుస్తీ లాంటి మాటలు కనీసం ఏడెనిమిది వందల యేళ్లుగా తెలుగు ప్రజల నోళ్లలో నానుతున్నాయి. ఇది అన్యభాషాపదం అంటే, సామాన్యులు ఆశ్చర్య పోయేంతగా అవి మన భాషలో కలిసి పోయాయి. కలుపుకు పోవటంలోనే విజ్ఞత ఉంది.

ప్రాకృతం, పాళీ, సంస్కృత భాషా పదాలు కాకుండా కేవలం విదేశీ భాషల నుండి మన భాషలోకి ప్రవేశించిన కొన్ని మాటల సేకరణే ఈ పుస్తకం. ప్రాచీన సాహిత్య ఆధారాలను ఇంకా లోతుగా అధ్యయనం చేస్తే మరిన్ని అతిథిపదాలు మనకు దొరికే అవకాశం ఉంది. పరిశోధకులకు, తెలుగు భాషాభిమానులకు ఈ పుస్తకం ఉపయోగపడగలదని భావిస్తున్నాను

'నుడి కలిమి' మనది! మన భాషలో పదాలకు కొదవలేదు. ఎప్పటికప్పుడు అప్పటి అవసరాలకు తగ్గట్టుగా ఎన్నో పదాలను రూపొందించుకుని నాగరికతను నిలబెట్టుకున్న భాష మనది. ఎన్ని పరభాషా పదాలుంటే అంత నాగరికమైన జాతిగా వెలుగొందినట్టుగా భావించుకోవాలి.

ప్రఖ్యాత సాహితీవేత్త. సంగీత నాటక అకాడెమీ జాతీయ పురస్కారం పొందిన ఏకైక తెలుగు నాటక రచయిత ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతీ సమితి ముఖ్య కార్యనిర్వహణాధికారి డా. దీర్ఘాసి విజయభాస్కర్ గారు 'పదనిధి' పేరుతో ఆధునిక అవసరాలకు తగ్గట్టుగా తెలుగు భాషా పదాల్ని ఒకచోట చేర్చే లక్ష్యంతో కృషిచేస్తున్న వ్యక్తి. వారి సూచన మేరకు తెలుగులో అతిథిపదాలు, ఇంటిమాటలు, మొక్కల తెలుగు పేర్లు, జంతువుల తెలుగు పేర్లు, వైదిక పరిభాష ఇలా వివిధ విభాగాలకు చెందిన తెలుగు పదాలను ఒకచోట చేర్చే కృషిలో భాగంగా ముందుగా ఈ చిన్న పుస్తకాన్ని వెలువరిస్తున్నాను.

గౌరవనీయులు డా. మండలి బుద్ధప్రసాద్ గారి ప్రేరణతో ఈ సంకలనాన్ని వెలువరించ గలుగు తున్నాను.

2018 ఫిబ్రవరి 10,11 తేదీలలో కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో శ్రీకృష్ణదేవరాయ మహోత్సవంలో భాగంగా జరిగే తెలుగు భాషా బ్రహ్మోత్సవాలను చిరస్మరణీయం చేస్తూ ఈ పుస్తకం విడుదల కావటం సంతోషంగా ఉంది.

**డా. జి వి పూర్ణచందు**

# తెలుగులో అతిథిపదాలు

**నా**గరికత పెరిగి ప్రపంచం అంతా ఒక కుగ్రామం అయ్యాక ప్రపంచం అవసరాలు పెరిగాయి. మనవి కాని వస్తుసామగ్రి అనేకం వాడకంలోకి వచ్చాయి. అవి మనవి కావు కాబట్టి, వాటి పేర్లు, వాటి సాంకేతిక పరిజ్ఞానం మన భాషలో ఉండవు.

సెల్ఫోన్, కంప్యూటర్, ఇంటర్నెట్టు లాంటి వాటికి తెలుగులో పేరు చెప్పాలని కొందరు ఆంగ్లభాషాభిమానులు ఎద్దేవాగా అడుగు తుంటారు. విషయం ఏమంటే సాంకేతిక పారిభాషిక పదాలన్నీ ఇంగ్లీషే ననుకోవటం ఒక అపోహ. అవి ఇంగ్లీషులో కూడా చాలా వరకూ విదేశీ అరువు పదాలే! లాటిన్, జెర్మనీ, ఫ్రెంచి లేదా ఇతర భాషా పదాలు కావచ్చు. వాటి ఆవిష్కర్తల్లో భారతీయులు కూడా ఉన్నారు. ఆర్యభట్ట, వరాహమిహిరుడు లాంటీ శాస్త్రవేత్తలు రూపొందించిన చాలా వైజ్ఞానిక పదాలు లాటిన్ తదితర భాషల్లో కూడా ఉన్నాయి. వాటిని మనం గుర్తించి లోకానికి చాటటంలో విఫలం అవుతున్నాం.

విజ్ఞాన సంపద మొత్తం మానవాళికి హక్కు భుక్తం కాబట్టి, పారిభాషిక పదాలకు దేశీయత గురించి ఆందోళన అవసరం లేదు. 1200 సంవత్సరాలుగా పర్షియన్లు, అరబ్బులు, పోర్చుగీసు, డచ్చి, ఫ్రెంచి, ఆంగ్ల భాషీయులు తెలుగు నేలమీద పాలనా వ్యవహారాలు నడపటం వలన, మనల్ని మనం మన భాషలో పరిపాలించుకో లేక పోయాం. స్వాతంత్ర్యం వచ్చాక కూడా మనం అలాంటి ప్రయత్నం చేయలేకపోయాం. అది మన తప్పు. అందువలన పాలనా వ్యవహారాల్లో దేశీయ పదాలు రూపు కట్టుకునే అవకాశం లేకుండా పోయింది.

కాకతీయులు, రెడ్డి రాజులు, విజయనగర రాజుల శాసనాలలోనూ, ఆనాటి సాహిత్యంలోనూ పాలనాపరమైన చాలా పారిభాషిక పదాలు ఉన్నాయి. నిజాం, గోల్కొండ ప్రభువులు వాటిని పక్కనబెట్టి అరబ్బీ, పర్షియన్ పదాలతో పాలన సాగించారు. ముఖ్యంగా రెవెన్యూ, పోలీసు తదితర యంత్రాంగం అంతా పర్షియన్, అరబ్బీ పదాలతో నిండిపోయింది.తెలుగువారు పెద్ద మనసుతో వాటిని స్వీకరించారు. రోజు (a day) అనేది తెలుగుమాట కాదు, పారసీక పదం అంటే ఆశ్చర్యమే అనిపిస్తుంది.

ఎఫ్ బి జె క్విపర్ అనే పరిశోధకుడు దాదాపు 350 పదాలు ఇండో యూరోపియన్ భాషాకూటమికి చెందినవి కావని తేల్చాడు. అవి ద్రావిడ లేదా ముండా భాషాపదాలు కావచ్చని తెలిపాడు. ఋగ్వేదంలోని అన్యదేశ్యాల్లో మత్స్య, మీన, పుత్ర, మయూర, తాళ, గజలాంటి పదాలు ఉన్నాయని ఆయన అభిప్రాయపడ్డాడు.

కురాన్‘లో 322 అరువుపదా లున్నాయని జమ్మిత్ అనే పండితుడు తేల్చాడు. బైబిల్లో అత్యధికంగా అన్యభాషా పదాలున్నాయి. బైబిల్ కాలంలో హిబ్రూ మాట్లాడే ప్రజలకు ఇండియా, చైనా ఇతర తూర్పు దేశాలకూ, మధ్యాసియా దేశాలతోనూ నడిచిన వాణిజ్య సంబంధాల కారణంగా ఇతర బాషా పదాలు హిబ్రూ పౌరుల నోట్లో నాని, బైబిల్లోకి చేరి ఉండవచ్చు. వీటి గురించి ఇదే పుస్తకంలో మరోచోట వివరంగా ఇస్తున్నాను.

లాటిన్ pyramis గ్రీకు puramis,ఇంగ్లీషులో "pyramid" అయ్యింది.

మమ్మీ (mummi) అనే మాట ప్రాచీన ఫ్రెంచి momie లోంచి మధ్య యుగాల నాటి లాటిన్ mumia మూలాల్లోంచి ఏర్పడింది.

Gum (జిగురు) అనే పదం లాటిన్ gummi గ్రీకు kommi అనే బూతు మాటలోంచి పుట్టిందట.

ఇంగ్లీషు భాషలో అరువుపదాలు చేరేకొద్దీ ఇంగ్లీషుభాష మరింత సంక్లిష్టంగా conservativeగా తయారయ్యిందని విశ్లేషకులంటారు. అమెరికన్ ఇంగ్లీషులో ఉన్న స్వేఛ్ఛ బ్రిటిష్ ఇంగ్లీషులో లేకపోవటానికి కారణం ఇదే నంటారు.

**అతిథి పదాలు వచ్చే దారులు**

అతిథి పదాలు రాకడ, పోకడలుగా సాగే ఒక నిరంతర పరిణామక్రమానికి సంబంధించినవి. రాకే గానీ పోక లేకపోవటం జాతి వెనుకబాటును సూచిస్తుంది. తెలుగు భాష ఏ స్థితిలోనూ అలాంటి వెనుకబాటు కలిగినది కాదు.

వాణిజ్య సంపన్నత కలిగిన భాష. తెలుగులోంచి సంస్కృతంలోకీ, ఆంగ్లంలోకీ, ఫ్రెంచి లోకి కూడా అనేక పదాలు అరువెళ్ళాయి. కోరాడ రామకృష్ణయ్య 1920లలోనే, పుత్ర, మత్స్య, మీన, తాళ లాంటి పదాలు తెలుగులోంచే సంస్కృతంలోకి చేరాయని నిరూపించారు. అలాగే, పందికొక్కు (బండికూట్), జజ్జర్‘నాట్ (జగన్నాథ రధం)లాంటి అనేకపదాలు ఆంగ్లంలోకి తెలుగులోంచే వెళ్ళాయి. ప్రజల మధ్య సన్నిహితత్వం, సహజీవనం, సమజీవనం లాంటి కారణాల వలన, వాణిజ్య సంబంధాల వలన, శాస్త్రీయ సంబంధాల వలన ఈ రాకడ-పోకడలు (ఆదాన ప్రదానాలు) వేగవంతం అవుతాయి.

టేకుమళ్ల రాజగోపాలరావుగారు 1933లో ఇంగ్లీషు, ఆంగ్లో శాక్సన్, డేనిష్, జర్మన్ తదితర భాషల్లోకి తెలుగులోంచి అనేక పదాలు వెళ్ళాయంటూ శబ్ద సాదృశాన్ని, అర్థ సాదృశాన్నీ ఆధారం చేసుకుని దాదాపు 104 పదాలను గుర్తించారు. పడు (Fall), మేత (meat), తిరుగు (turn), వ్రాత (write), వేగింపు (Bake), పీలిక

(peel), పాలిపోవు (pale), చీపురు (sweep) ఇవన్నీ తెలుగులోంచే వెళ్ళిన అరువు పదాలని ఆయన భావన!వెదికితే ఇలాంటి పోకడలు కూడా దొరుకుతాయి.

ఒకభాషాపదాలు ఇంకో భాషలోకి అనేక దారుల్లో రాకపోకలు జరుపుతాయి.

**"ఆంధ్రులు నానా**
**దేశంబుల యందు నిలిచి తెలుగులె తత్త**
**ద్దేశోక్తులంట( బలికిన**
**నా శబ్దములన్యదేశ జాంధ్రములయ్యెన్"** (1-108)" అని 1656లో అప్పకవి ఒక నిర్వచనం ఇచ్చాడు. ఆంధ్రులు వాణిజ అవసరాలకోసం అనేక దేశాలకు వెళ్ళటం వలన, అనేక దేశీయులు ఇక్కడకు రావటం వలన తెలుగు భాషలో అనేక దేశాల భాషల పదాలు వచ్చి చేరాయని, వాటిని అన్య దేశ్యాలుగా భావించాలనీ అప్పకవి పేర్కొన్నాడు.

"శుద్ధాంధ్రంబులు", "అన్య దేశ్య జాంధ్రంబులు" అని తెలుగు భాషను రెండు రకాలుగా అప్పకవి వర్గీకరించాడు. అన్య దేశ్యాలు లేదా అతిథి పదాలు అనేక రకాలుగా మన భాషలో ప్రవేశించాయి.

**నేరుగా వచ్చి చేరే పదాలు :** కంప్యూటర్ లాంటి పదాలు యథాతథంగా ఉచ్చారణతో సహా నేరుగా వచ్చి చేరిన పదాలు. అత్తరు, అంజీర, అదాలత్తు, నశీబు లాంటి పర్షియన్/అరబ్బీ పదాలు తెలుగులోకి నేరుగానే చేరాయి. వాటిని అవసరార్థం ఉన్నదున్నట్టుగా ఉపయోగించుకుంటున్నాం. అలా వాడితేనే ఉపయోగం ఎక్కువ.

అర్థాన్ని అరువు తెచ్చుకున్న (semantic loan words) పదాలు: ఒక భాషా పదాన్ని వేరొక భాషలోకి అనువదించి తెచ్చుకోవటం ఒక్కోసారి జరుగుతుంది. ముంజీ అనేది వైదిక కర్మలకు సంబంధించిన పదం. ఉపనయనం అయ్యాక జంధ్యానికి జింక చర్మాన్ని కడతారు. కన్నడ ప్రాంతాల్లో ముంజీ అంటే ఉపనయనం అనే వ్యవహారమే ఉంది. ముస్లిం బాలురకు సున్తీ చేసే ఆచారాన్ని తెలుగు ప్రాంతాల్లో మహమ్మదీయిలు 'ఒడుగు' అనీ, కర్ణాటకలో ముంజీ అని వ్యవహరించటం కనిపిస్తుంది. మత గ్రంథాల్లో చెప్పినట్టు బాలురకు చేసే ఒక జాతకర్మ అని చెప్పటమే ఇందులో ఉన్న రహస్యం.

**పత్రికలు సృష్టించిన అరువు పదాలు :** బ్లాక్ మార్కెటింగ్ (నల్లబజారు, నల్ల వ్యాపారం) అని తెలుగులోనూ, కాలా సంతె అని కన్నడంలోనూ వ్యవహరించటం అరువు అనువాద పదాలకు ఒక ఉదాహరణ. రెడ్ టేపిజంని 'ఎర్రనాడా నేరాలు' అని తెలుగులోనూ, కెంపు దారిగే అని కన్నడంలోనూ వ్యవహరిస్తారు.

దేశీ, విదేశీ జంటపదాలు: పేపర్ కాయితం లాంటి మాటలు యాదృచ్ఛికంగానే పలుకుతుంటాం మనం. ప్లాస్టిక్ కాయితం, మైనం కాయితం లాంటివి వచ్చాక 'పేపర్ కాయితం' అనేది సాధు శబ్దమేఅవుతుంది. 'పీర్' అంటే పర్షియన్ భాషలో గురువు. కన్నడ ప్రాంతాల్లోనూ, రాయలసీమలోనూ మహమ్మదీయ ప్రాబల్యం ఉన్న చోట గురువు, పీరు కలిపి 'గురుపీరు' అనే మాట వ్యాప్తిలో ఉంది. అలాగే, 'రీతీ-రివాజు' లాంటి ద్వంద్వ పదాలు కొల్లలుగా కనిపిస్తాయి. రీతి అనే పదం మనకు ఉండగా రివాజుని అరువు తెచ్చుకున్నప్పుడు రెండింటినీ కలిపి 'రీతీరివాజు' అనటం సహజంగా జరిగేదే! సిగ్గు అనే తెలుగుమాట, ఎగ్న అనే పర్షియన్ పదం 'సిగ్గాగ' అనే జంట పదంగా మారింది.

**స్వదేశీ విదేశీ మిశ్రమ పదాలు :** ఒక స్వదేశీ ఒక విదేశీ పదాన్నీ కలిపి ముడిపెట్టి కొత్త అర్థాన్ని సాధించటం ఇందులో కనిపిస్తుంది. ఫిల్మోత్సవ్, యూతోత్సవ్, ఫిడేల్ రాగాల డజన్, లాంటి ప్రయోగాలు ఇందుకు ఉదాహరణ. ఇవి జనంలో బాగా ప్రసిద్ధి పొంది వ్యాప్తిలో నిలిచి పోయాయి కూడా! పిండి రుబ్బింగ్ మెషీన్, కేశ రిమూవనీ శాల లాంటి ప్రయోగాలు కూడా అలవోకగా జరిగి పోతాయి.

**అర్ధ విస్తృతి నిచ్చే అరువు పదాలు :** ఉదాహరణకు 'కఫే' (café) అనే ఫ్రెంచి పదం ఇంగ్లీషు లోకి అరువెళ్ళి, 'కాఫీ' అయ్యింది. పర్షియన్ 'బజార్' పదం ప్రపంచం అంతటా 'మార్కెట్' అనే అర్థంలోనే వ్యాప్తిలో ఉంది. 'కిండర్'గార్టెన్' (పిల్లల తోట) అనే జెర్మనీ పదం ఇంగ్లీషు, తదితర భాషల్లోకి 'ఒకటో తరగతి కన్నా ముందు గానే చేర్చుకునే బడి (preschool) అనే అర్థంలో చేరింది. నక్ల్ (Naql) అనే అరబ్బీ పదంలోంచి నకలు (కాపీ తీయటం), నకిలీ (అబద్ధం) మాటలు ఏర్పడ్డాయి. కన్నడ భాషలో నకిలీ శబ్దాన్ని విదూషక చేష్టలకు మాత్రమే వాడతారు..

'మసాలా' అనే పదాన్ని నేపాలీయులు 'మసలా' అంటారు. సుగంధ ద్రవ్యాల పొడి అని స్థూలంగా దీని అర్థం. "ఈ కూరలో మసాలా ఎక్కువ వేయొద్దు (తకరీమా ధెరాయి మసలా నహాల)" లాంటి ప్రయోగాలు మాత్రమే కాకుండా ఇంకా అనేక నూతన ప్రయోగాలు కూడా వీళ్ళు చేశారు. 'ఆశ్చర్యం కలిగించే విషయం' అనటానికి 'మసాలా విషయం' అంటారు. 'క్లూ' (తేలిక పరిష్కారం) అనే అర్థంలో, ఈ పరీక్ష పాసవటానికి మసాలా ఏదైనా ఉన్నదా? అనడుగుతారు. వీటన్నింటికీ మించిన మరో ప్రయోగం కూడా ఉంది. "రేరియోమా మసలా సిద్దియో" రేడియోలో మసలా సిద్ధిపొందింది...అంటే చచ్చి పోయిందిట...దీని భావం ఆ రేడియోలో బ్యాటరీ అయిపోయిందని! ఒక పరభాషా పదాన్ని జాతీయం చేసి దేశీయం చేసుకోవటం ఎలాగో ఈ ఉదాహరణ మనకు నేర్పుతోంది. రైలు, రోడ్డుల్ని ఇలా దేశ్యం చేసుకోగలగాలి మనం

**జ్ఞాతిభాషాపదాలు :** వైదిక సంస్కృత భాష, ప్రాచీన పార్సీ(పారసీక భాష) ఇవి రెండూ జ్ఞాతి భాషలు. అంటే, ఒకే భాషా కుటుంబానికి (ఇండో యూరోపియన్ భాషాకూటమి) చెందినవి. రోజ్(రోజు), గరమ్(ఘర్మ), చర్'ఖ్ (చక్ర), నమాజ్ (నమస్) లాంటి పదాలు వేదకాలంలోనే పారశీక, వైదిక భాషల మధ్య వ్యాపనం చెందాయి. కాబట్టి, సంస్కృతంలో పార్శి పదాలు, తెలుగులో సంస్కృత ప్రాకృత, పాళీ తత్సమాలు, తద్భవాలను కూడా అరువు పదాలుగా భావించనవసరం లేదు.

సంస్కృతం, ప్రాకృతం– 'వణిజ'– తెలుగులో 'బలిజ'

సంస్కృతం 'వాపి', ప్రాకృత 'వావి' తెలుగులో 'బావి'

సంస్కృతం 'వృషభ' ప్రాకృతంలో వసభ(హ) తెలుగు కన్నడ భాషలలో 'బసవ'

సంస్కృతం 'వేత్ర', ప్రాకృత'వేత్త', తెలుగులో 'బెత్తము'

సంస్కృతం 'వైశ్య', ప్రాకృత 'వేస్స', తెలుగులో 'బచ్చు'

సంస్కృతం 'వ్రీడా', ప్రాకృత'విడ్డా, వీడా', తెలుగులో 'బిడియము'

ఇలాంటి రూపాంతరాలు కూడా కనిపిస్తాయి. అలాగేతెలుగు, తమిళ, కన్నడ, భాషల మధ్య కూడా ఆదాన ప్రదానాలు అనేకం జరిగాయి. ఇవి జ్ఞాతిభాషలు, ఇరుగుపొరుగు భాషలు కాబట్టి, వీటి మధ్య పద మార్పిడి సహజం కాబట్టి, ఇవి అరువు పదాలు కావు. అయితే, మరాఠీ, హిందీ, బెంగాలీ, ఒరియాలాంటిఇతర దేశ భాషల్లోంచి వచ్చిన చేరినవి అరువుపదాలే అవుతాయి.

**అన్యదేశ్యాలు - తెలుగు భాషా సంపన్నత**

సంస్కృత, ప్రాకృతాల నుండి వర్ణలోప వర్ణాగమాది పరిణామాలవలన తెలుగులోచేరినవి తద్భవాలు. పరీక్షించు అనేది తత్సమము. పరికించు తద్భవము.పరాకు, పరకాయించు అనేవి హిందీ భాషలోంచివచ్చినఅన్యదేశ్యాలు.

క్రీ. శ. 1405 నాటి కావ్యాలంకార చూడామణి కర్త విన్నకోట పెద్దన అన్యదేశ్యాలను వివరిస్తూ,

"కవమున దత్సమమును ద
ద్భవమును సహజాంధ్రదేశభవమును
దేశోద్భవమును గ్రామ్యమునన (బంచ విధములై
తెలుగు పలుకుజాతము పర (గున్ (9–11:

తెలుగులో తత్సమాలు, తద్భవాలు, సహజాంధ్రదేశ భవాలు,

దేశోద్భవాలు, గ్రామ్యాలు అని ఐదు రకాల పదాలు ఉన్నాయని విన్నకోట పెద్దన వివరణ. ఈ ఐదురకాలపదాల్లో గ్రామ్యం అనేదే ముఖ్యం. ఎవడూ పుట్టించకపోతే పదాలు ఎలాపుడతాయన్న సూక్తి ననుసరించి సంస్కృతాంగ్ల భాషలు రానివాళ్ళు సృష్టించే పద సంపదను 'గ్రామ్యం'గా చెప్పుకుంటే భాషాసంపన్నతకు మూలాలు దొరుకుతాయి.

ఫ్లై-ఓవర్ని 'పై వంతెన' అనీ, ఇసుకను తోడే యంత్రం డ్రెడ్జర్'ని 'తవ్వోడ' అనీ, ట్రాఫిక్-జామ్ కావటాన్ని 'దారొత్తిడి' అనీ గుడ్'మార్నింగ్ చెప్పటాన్ని 'మంచిపొద్దులు' అనీ పామరుడైన గ్రామీణుడే చెప్పగలడు. పండితుల్ని తెలుగులో చెప్పమంటే ఊర్ధ్వ వారధి, ద్విచక్రవాహనము లాంటి సంస్కృతానువాదాలు వస్తాయే గానీ చక్కని తెలుగుమాట పుట్టదు. ఒక పాల్కురికి సోమన, ఒక తిక్కన ఒక చేమకూరవేంకటకవి లాంటి వాళ్ళు ఇందుకు మినహాయింపులు.

"శ్రేయములై బహు దేశా
నేయములై చక్క ఁదనము నెఱ(దనములునై
యాయా నెలవుల ఁజెవులకు
దీయములగు పలుకులెల్ల దేశ్యములరయున్ (9-16)" మనకు ఉపయోగ పడేవిగానూ, అనేక దేశాల్లో వాడకంలో ఉన్నవి గానూ, వినసొంపుగానూ, చక్కగా మన భాషలో ఇమిడిపోగలిగే పదాలను దేశ్యాలుగానే భావించుకోవాలన్నాడు.

"విన్నకోట పెద్దన నిర్దేశించిన సహజాంధ్రదేశ భవమును, అప్పకవి చెప్పిన శుద్ధాంధ్రంబులు నొక్క తెగ, పెద్దన దేశోద్భవమే అప్పకవి పేర్కొనిన అన్య దేశజాంధ్రము" అని తూమాటి దొణప్ప గారు విపులీకరించారు.

తల్లి, తండ్రి లాంటి పదాలు దేశ్యము, తావి, మోవి అన్యదేశ్యము అని శబ్ద రత్నాకరం.

"ప్రసిద్ధ అన్య దేశ్యంబులు ప్రయోగార్హంబులు" అనే గాణపత సూత్రం ప్రకారం, తమిళ కన్నడ పదాలు తెలుగులో కనిపించినప్పుడు వాటిని దేశ్య పదాలుగానే భావించాలనేది ఈ సూత్రం. కిమ్మూరి నరసరాజు (క్రీ॥శ॥ .1800) పాదుశా, కటారి మొదలినవి దేశ్యాలని నిరూపించాడు.

లష్కరీ (దళవాయి, సేనాని) తెలుగులో లసికిరిగా కాకమాని మూర్తికవి రాజవాహన చరిత్రలో ప్రయోగించాడు (లసికిరి జోదులగ్గలిక లగ్గల కెక్కిన) 'లసికిరి జోదులు' అంటే సైన్య 'మూలబలం'. పిసికిరి-పిసుకు, నసిగిరి-నసుగు, పలికిరి-పలుకులాగానే ఈ లసికిరి లోంచి 'లసుకు' అనే మాట పుట్టింది. 'అనిష్టమూర్తిని నాశనము చేయు అనే అర్థంలో కవులు ప్రయోగించారనిదొణప్ప గారు ఈ ప్రయోగం పట్ల తన అయిష్టతను వ్యక్తపరచారు.

కానిష్టేబులు అనే పదం చివర 'లు'కారం చేత బహువచనంగా భ్రమ కల్పిస్తుంది. కనిష్టీబు అని దానికి ఏకవచనం కన్యాశుల్కం నాటకంలో కనిపిస్తుంది. ఇలాంటి మాటలు ఒకరు పనిగట్టుకుని సృష్టించక పోవచ్చు. జన వ్యవహారంలో ఒక్కో పదం ఒక్కో రీతిలో పరిణమిస్తుంది.

తిక్కన గారు చేసిన 'ఆదమరచి' ప్రయోగం పారసీ 'యాద' లోంచి పుట్టింది" అని కోట సుందర రామ శర్మ గారి ప్రతిపాదన. తిక్కన ప్రయోగించిన త్రాసు కూడా వాణిజ్య పరమైన ముఖ్య వస్తువు. కాబట్టి, అరువు రాక తప్పదు. అంతకు మునుపు మనకు తూనికలు కొలతలు తెలియవా...? దానికి తెలుగు పేరు లేదా? ఉంటే ఏమై పోయింది? శాతవాహనులకు పూర్వంనాటి ఆంధ్రరాజులు విదేశీ వాణిజ్యాలు చేశారని చరిత్ర కోడై కూస్తోంది. త్రాసులేని వ్యాపారం ఎలా సాధ్యం? వుంటే ఏ పేరుతో పిలిచారు?

"కొత్తమాటలను ఏర్చికూర్చుట శబ్ద దారిద్ర్యము వలన కాదు. ప్రాతపడ్డ మాటలను పరిహరించుటయు, క్రొత్త పలుకు బడుల్ని స్వీకరించుటయు కవి సంప్రదాయము. విశేషించి నూతన వస్తు సన్నిధిని ప్రసన్న వివేకముగ తద్బోధకములగు పదములను ప్రయోగించుట అర్థవ్యక్తికి, ఝుటిత స్ఫూర్తికీ ఆవశ్య కర్తవ్యము. పలుకుల పొందికలో నాజూకు పోకడలకు మోజు పడెడి రసప్రలుబ్ధుల కిట్టి పటులు అమృత చషకములు..." (తూమాటి దొణప్ప-భాషా చారిత్రక వ్యాసావళి, పేజీ 168)

సమాజ ప్రగతిశీలతను బట్టి భాషలోకి కొత్త పదాల రాకపోకలు ఆధారపడి ఉంటాయి. అన్యదేశ్యాన్ని వాడుకోవటానికి నామోషీ అక్కరలేదు. కంప్యూటర్, సెల్ఫోన్ లాంటి అన్యదేశ్య సాంకేతికతను వాడుకోవటానికి లేని సిగ్గు, వాటి పేర్లను పలకటానికి దేనికి? కొందరు పని గట్టుకుని వాటికి తెలుగు పదాలు వండాలని ప్రయత్నించి సంస్కృతాన్ని ఆశ్రయిస్తున్నారు, ఇంటర్నెట్టుని అంతర్జాలం అన్నందు వలన తెలుగు భాషకు ఒరిగేదేమీ ఉండదు. సంస్కృతానికి కొత్తగా వచ్చి పడేదీ లేదు. సాంకేతిక పదాల విషయంలో భాషాభిమానం వెర్రి పోకడలు పోకూడదు. లేత ఆకులు వంపులు తిరిగి ఉండే తీరుని సర్సినేట్ వెర్నేషన్ అంటారు. దీన్ని వలిత కిశలయ విన్యాసం అని అనువదించి, అవి తెలుగు పదాలని మనల్ని నమ్మించి, తెలుగు మీడియం పేరుతో విద్యార్థుల భవిష్యత్తుని బంతాట ఆడుకుంది తెలుగు అకాడెమీ! మాతృభాషలో విద్యాబోధనకు తెలుగు అకాడెమీ వక్ర భాష్యం చెప్పింది.

వెన్నెముక కలిగిన ప్రాణులు, వెన్నెముకలేని ప్రాణులు అని చెప్తే విద్యార్థికి అర్థం అవుతుందా...? లేక సకశేరుకములు, అకశేరుకములు అంటే అర్థం అవుతుందా అని ఆలోచించాలి.

అన్యదేశ్యాలు పులిహోరలో జీడిపప్పులా ఉండాలి గానీ, సీతాఫలంలో గింజల్లా ఉండకూడదు. వందేళ్ళ కొకసారి పండితులు అప్పటివరకూ జనవ్యాప్తిలో ఉన్న అతిథి పదాలను జాతీయం చేస్తున్నట్టు ప్రకటించటం వలన రైలు, రోడ్డు, సబ్బు లాంటి పదాలు దేశ్య పదాలుగా నిలబడతాయి. అప్పుడు తెలుగు భాష పరిపుష్టికి అన్యదేశ్యాలు తోడ్పడినట్టౌతుంది.

## ప్రాచీన తెలుగు సాహిత్యంలో అన్యదేశ్యాలు

"విలాతి బాజారు దుకాణదారులనుండి జలతారుకుల్లాయులు, జరీ శాలువులు, ముఖమల్లు మోజాలు, లాలుజీబులు, పింగాణీ సామానులు, సుప్పాణి ముత్యములు, గంజాయి, గసగసలు, మొదలగు లాహిరి దినుసులు, హురుముంజి తేజీలు, కప్పలి, జోగు, వల్లి, వలికా, సమ్మాన్లలో తెప్పించి సలీసు వెలలకు విక్రయించి, అసలు కర్చు వహితేల్చి, కోటికి పడగ లెత్తినవాడు, జల్కుపోసనపు జమ్ముభావనములు పరచిన హజారపు చావడిలో జాళువా పైడి తఖ్తుపై తబల, సన్నాయి, దమాములు మ్రోయ ఖుసిమీరన్ సురధాణి నిండు కొలువై కూర్చుండెడివాడు. కొజ్జాలు, గులాములు సేవింప నకీబులు పరాకులెచ్చరింప, విలాతిఖానులు, సరిహద్దు సహేలు పంపిన రాయబారులు వచ్చి ఆరబి, ఆరె, పారసి, రుమీ మొదలగు బాసలలో వ్రాసిన కాకితములను వినిపించెడివారు. విలాతి దుకాణదారులు వచ్చి కుందనపు కమ్మరుబందులు, చికిలి సేసిన అపరంజి మోళపు బాఁకులు, బిబ్బీల గాగరాలు, ఉలుపా చదివించెడివారు. జూటరులు గలబ, జులుము, లూటి సేయకుండ గస్తుకావలివారు కాఁపుండెడివారు. కంఖాణి, కత్తలాని, సాంబ్రాణి, జిరా తేజీలపై చబుకుసేయు సవాలక్ష పౌజు బరాబరులు సేసెడిది"

శ్రీనాథుడి హరవిలాసంలో ఈ ఉదాహరణ ఆనాటి బేహారుల వాణిజ్య ప్రతిభతోపాటు తెలుగులోకి చేర్చిననేక అన్యదేశ్యాలకు పదాలకు సాక్ష్యంగా నిలుస్తుంది:ఇవి సాక్షాత్తు శ్రీనాథుడి వాక్యాలు. ఇవి చదివితే, అంతా తెలుగే అనిపిస్తుంది. కానీ, ఇందులో

కేవలం కొన్ని క్రియా పదాలు మాత్రమే తెలుగులో కనిపిస్తాయి. తక్కినవన్నీ పర్షియన్, అరబ్బీ, పోర్చుగీసు అరువు పదాలే! ఈ విధమైన భాషని ఒకప్పుడు జనం మాట్లాడే ఉంటారు. వీటిని యథాతథంగా శ్రీనాథుడు రికార్డు చేయటమే ఇక్కడి విశేషం.

అపరంజి : కాల్చిన బంగారం
అసలు = మూలము
ఉలుపా = కానుకలు
కంఖాణి = ఆఫ్ఘనిస్థాన్ మేలిమి గుర్రం
కత్తలాని = కత్తలాణివఖత్తులాణం: కవచం తొడిగిన ఖత్లాన్ దేశపు గుర్రం
కప్పలి = సరకు రవాణా చేసే ఓడ
కర్చు = వ్యయం
కాకితములను = కాకితము:(పోర్చుగీసు కాతరస్)వ
ముతక పేపరు, కర్తాజ్ : అనుమతి పత్రం, స్పానిష్
కర్తాచో, ఫ్రెంచి కర్తూష్, అరబీ కిర్తాస్,
ఖుసిమీరన్ = ఖుషీ పొందటం
గలబ = అలజడి,
గసగసలు = గసగసాలు
గస్తుకావలివారు = గస్తు(గస్తీ)-దొంగలు పడకుండా కావలికాసేవారు-గస్తుకావలి అనేది పేపరుకాయితం లాంటి విచిత్ర ప్రయోగం
గాగరాలు = మరాఠీ వస్త్ర విశేషం,
గులాములు (గుల్లాములు) = ఉంపుడుకత్తె, నీచురాలు
చబుకుసేయు : గుర్రాన్ని అదిలించు (చబుకు = మరాఠీ-చాబూక = కొరడా)
జరీశాలువలు = జరీ అంచు పట్టు ఉత్తరీయాలు
జలతారు కుల్లాయులు = మెరిసే చిన్న టోపి
(కుళాయ, కుళ్లా, కుళ్లాయ, కుల్లాయి కులాయి).
జలపోసనము = బంగారపు పూత
జమ్ముఖాణము = రంగుల నూలు పట్టెలు కల ఆస్తరణము- carpet
జిరా = అంబారీ కోసం ఏనుగు లేదా గుర్రం మీద వేసే వస్త్రం
జులుము = దుండగం,
జూటరులు = అబద్ధాల కోరులు
జోగు = పెద్ద తెరచాపలు 12 గలిగిన ఓడ
తేజీలు = మేలు జాతి గుర్రాలు
దుకాణాదార్ = అంగడి వాడు
నకీబులు = చోపుదారి, ఎచ్చరికలు చెప్పే స్తోత్రపాఠకుడు
పింగాణీ = ఒక రకం మట్టిపాత్ర
పౌజు = పటాలము

బరాబరులు = ప్రభుదర్శనానికి వచ్చిన జనాన్ని క్రమశిక్షణలో ఉంచటం, సమానం చేయటం

బాజారు(పర్షియన్) = విపణి వీధి

బిబ్బీల = తోరణాల

ముఖమల్లు మోజా (పర్షియన్) = ముందు వైపు మెలి తిరిగి ముఖమల్లు గుడ్డతో కుట్టిన చెప్పులు

మోళపు బాకులు : మోళము = వెండి లేదా బంగారం పూత, మోలాము, మలాము

లాలుజీబులు = ఎఱ్ఱ చీరెలు

లాహిరి = మాదకద్రవ్య సేవనం వలన కలిగేమత్తు

లూటి = దోపిడి

వల్లి, వలికా = సరుకు రవాణానౌక

వహి = లెక్కలు

విలాతి దుకాణదారులు : విదేశీ వ్యాపారులు

విలాతి (మరాఠీ) = పరదేశం

విలాతిఖానులు = విదేశి ప్రతినిధులు

సమ్మాన్లలో తెప్పించి = పోర్చుగీసు-మూడు పలకల పడవతో తెప్పించి,

సరిహద్దు సహేలు = సహే(మరాఠీ)వ చక్రవర్తి, శహేవరాజు

సలీసు = సులభమైనది

సవాలక్ష (మరాఠీ) = లక్షా పాతికవేలు

సామ్రాణి = పర్షియన్ జాతి గుఱ్ఱం, సమరాణ అనేది టర్కీలో ఒక నగరం,

సుప్పాణి ముత్యములు = శుభ్రమైన నీరు గల మంచి ముత్యాలు

సురధాణివ సురతాణి (సురతాను) = ఇంద్రుడు, సురతానివఇంద్రాణి,

హజారపు చావడి =ఆస్థానము, మొగసాల

హురుముంజి = పర్షియన్ జలసంధి తీరంలో గల ఒక పట్టణం

పోటీ యుగంలో మేటిగా నిలబడటానికి భాష అనేది కచ్చితంగా ఒక ఆయుధం. అనర్గళంగా ఆంగ్లంలో ఉపన్యసించ గలిగిన వాడికి మర్యాదా మన్ననా ఎక్కువ. తొలినాళ్ళలో సంస్కృతానికీ, మధ్య యుగాలలో ఉర్దూ-ఫర్షియన్ భాషలకూ, తరువాతి కాలంలో ఆంగ్లానికీ ఆ గౌరవం దక్కింది. ఆరోజుల్లో రాజభాషను ఇంత విచ్చలవిడిగా వాడటం ఒక గౌరవం.

లెటర్ పోష్టు చెయ్యి, టెంపుల్‘కి వెళ్ళి కోకోనట్ బ్రేక్ చేసిరా, గాడ్‘కి హాయ్

చెప్పు, ఫుడ్ సర్వ్ చెయ్యి లాంటి మాటలు మనం వింటున్నప్పుడు గుండెల్లో పొడిచి నట్టనిపిస్తుంది.

1397-1422 కాలం నాటి బహమనీ సుల్తాన్ ఫిరూజ్ షా వర్తక వాణిజ్యాల విస్తరణ కోసం పర్షియన్ సముద్ర తీర ప్రాంతం నుండి ఎర్ర సముద్ర తీరం దాక ఓడలను పంపించి విలాస వస్తువులు దిగుమతి చేసేవాడు. బేహారులు వాటిని మారు బేరాలకు అమ్ముకునేవాళ్ళు. ఈ మారుబేరగాళ్ల నోటినుండి వచ్చిన పదాలు పైన ఉదహరించిన శ్రీనాథుడి వచనంలో కనిపిస్తాయి. వీటికి తెలుగులో మాటలులేవా అంటే, వాణిజ్యలాభాలకు అలా మాట్లాడటమేముఖ్యం.

తెలుగు నేల మీదషాపులపేర్లు తెలుగులో ఎందుకుఉండవంటే ఇదే కారణం. ఎంత ఇంగ్లీషు మాట్లాడితే అంతనాణ్యమైన సరుకని మనం భ్రమపడాలని వాళ్ళ ఆశ. అరువు పదాలను తొలగించగలమా?

1930 లలో వి. డి సావర్కార్, డా. యం. టి పట్వర్ధన్ ప్రభృతులు మరాఠీ భాషలోంచి విదేశీ పదాలను ఏరివేసే ఉద్యమాన్ని ప్రారంభించారు. ఆ రోజున మరాఠీ లోంచి ఇంగ్లీషు, ఉర్దూ, పర్షియన్ అరబ్బీ పదాలను ఏరి వేయటం వాళ్ల ప్రధాన లక్ష్యం. కానీ, వాస్తవ స్థితి రంగంలోకి దిగితే గానీ వాళ్ళకు అర్థం కాలేదు. చివరికి సంస్కృతాన్ని ఆశ్రయించారు, మహమ్మదీయ పదాల స్థానే సంస్కృత పదాలను చేర్చి దానికి హిందూత్వరంగు పులిమారు. రఘువీర్ లాంటి పండితులు నిర్మించిన నిఘంటువులు సంస్కృతమయంగా ఉంటాయి. సంస్కృత పదాలు జాతీయతకు తోడ్పడతాయి గానీ,వాటివలన దేశీయతకు ఒరిగేదేమి ఉండదు. మాతృభాషను బతికించే ఉద్యమానికి సంస్కృతాభిమానం తోడ్పడదు. మాతృభాషభిమానాన్ని సంస్కృత వ్యతిరేకతగా భావించటం ఒక అపోహ.

తెలుగులో అన్యదేశ్యాలను దేశ్యాలుగా ప్రకటించే ప్రయత్నం ముందుగా జరగాలి. వాటిపట్ల వ్యామోహం ఎంత తప్పో, అంటు పాటించటం కూడా అంతే తప్పు. సంభాషణా నేర్పుకూ, సమర్థవంతంగా సమాచారం ఇవ్వటానికీ మనకు అన్య దేశ్యాలు అవసరం. ఒక్క ఇంగ్లీషు మాట లేకుండా మాట్లాడాలంటే అరకొర సమాచారం మాత్రమే ఇవ్వగలుగుతాం. కాబట్టి అతిథి పదాల అవసరం ఏ భాషకైనా ఉంటుంది.

సర్వసామాన్యమైన అవసరాలకక్కూడా ఇంగ్లీషునీ, సంస్కృతాన్నీ ఆశ్రయించటం మానుకోగలిగితే, మనం వాడటం మానేసిన అసలైన తెలుగు మాటల్ని వాడకంలోకి తేగలిగితే భాష పునర్నిర్మాణం అవుతుంది.

ప్రతీ భాషా ఆ భాషాజాతీయులకు ప్రియమైనదీ, ఘనమైనదీ, పవిత్రమైంది కూడా! ముత్తాతల నుండీ మునిమనుమల దాకా భాషా వారసత్వం కొనసాగుతూనే

ఉంది. నుడి పరిణామంలో అమ్మభాష అనేది ఒక మజిలీ. అది ఎప్పుడూ కొత్తదనాన్ని తొడుక్కుంటూనే ఉంటుంది. వాడిన కొద్దీ వన్నెకెక్కుతుంది.

ఒక 'భాషాప్రాంతం'లో(లాంగ్వేజీ ఏరియా) చోటుచేసుకున్న భౌగౌళిక, సామాజిక, సాంస్కృతిక, మత, రాజకీయ, ఆర్థిక పరిణామాల ఫలితంగా ఒక ప్రత్యేక భాష రూపుకట్టుకుని కాలక్రమంలో ఉన్నతి సంతరించుకుంటుంది.

వివిధ భాషీయుల సమీపవర్తిత్వం, సహజీవనాల కారణంగా ఒక భాషా పదాలు ఇంకో భాషలోకి అవసరం కొద్దీ చేరటం సహజం.

దైనందిన పరిస్థితుల్లో ఒక్కోసారి పరభాషా పదాల అవసరం కూడా ఏర్పడుతుంది. అందుకు సమానమైన పదం మన భాషలో లేనప్పుడు దాన్ని మన భాషాపదంగా స్వీకరించటం సబబు కూడా! ఎలాంటి అవసరం లేకుండా మోజుకొద్దీ పరభాషా పదాలను ఇష్టారాజ్యంగా వాడటం భాషాకాలుష్యానికి దారి తీస్తుంది. అలాంటి వ్యామోహం ఒకప్పుడు సంస్కృతం విషయంలో ఉండేది. ఫలితంగా తెలుగుకు జరగకూడనంత అపకారం జరిగింది. జానుతెనుగు, అచ్చతెనుగు ఉద్యమాలు ఎన్నివచ్చినా సంస్కృత వ్యామోహం ముందు దిగదుడుపయ్యాయి. ఇప్పుడు ఇంగ్లీషు వ్యామోహం అదే చేస్తోంది. తెలుగు చదవకూడదు, వ్రాయకూడదని విద్యావేత్తలచేత అనిపిస్తోంది.

అమ్మభాషను విస్మరించి, అవసరం లేకపోయినా మోజుకొద్దీ పరాయి పదాలను తెచ్చి జనం మీద రుద్దటాన్ని భాషాకాలుష్యంగా నిర్వచించవచ్చు. విస్మరీచటం వలన నస్మరంతిగా మిగిలిపోతాం అనేది హెచ్చరిక.

నస్మరంతులైన ఈ 'మోజువరులు' పరభాషను నేర్చుకోవటానికి అమ్మభాషను మరిచిపోవాలనే సిద్ధాంతాన్ని అమలు చేస్తున్నారు. ఇది విద్యారంగంలో మొదలై క్రమేణా అన్ని రంగాలకూ ఎగబాకింది. "ఇక్కడ రిక్షాలు ఆపరాదు" అనే బోర్డుని ఇంగ్లీషులో వ్రాయించి పెట్టిన అధికారి నిజంగా నస్మరంతే!

మాతృభాషను కించపరిచే వ్యక్తుల్ని, వ్యవస్థల్ని పట్టి శిక్షించ గలిగే భాషా కాలుష్య నివారక యంత్రాంగం ఉండాలని అంతర్జాతీయ స్థాయిలో అనేకమంది భాషావేత్తలు కోరుతున్నారు . వీళ్ళు భాషా ఛాందస వాదులో, ప్యూరిటనిస్టులో లేక గ్రాంధిక వాదులో కాదు, ప్రజల వాడుకభాష కలుషితం కాకూడదనే భావనతో భాషా కాలుష్య పరిస్థితిని నివారించేందుకు "భాషా కావలి వ్యవస్థ (లాంగ్వేజి పోలీసింగ్) కోరుతున్న వాళ్లు.

2013 తరువాత లాంగ్వేజి పోలీసింగ్ గురించి ఇంగ్లీషు, ఫ్రెంచి. రష్యన్ మేధావులు తరచూ చర్చిస్తున్నారు. 'నుడికావలి' విధుల్ని నిర్వర్తించే సుశిక్షితులైన

భాషాపోలీసులు లేదా టంగ్ ట్రూపర్ల ఏర్పాటు ప్రభుత్వ పరంగానే జరగాలి. అధికారాలు లేని సలహా మండళ్ళు అలంకార ప్రాయంగానే మిగిలిపోతాయి. పటిష్ఠమైన భాషా సంరక్షణ వ్యవస్థ కావాలి.

**వాడుకభాషే మాతృభాష**

మాతృభాష అనేది వాడుకభాషే గానీ పండితభాష కాదు. మనసు ఏనాడూ గ్రాంధికంలో ఆలోచించదు. లాక్షణిక వ్యాకరణ సూత్రాలు గ్రాంథికానికే ఉపయోగపడతాయి. పామరులభాష లేదా వాడుక భాష గాలికి ఆరబెట్టిన పేలాల పిండి లాంటిది. అది ఏ క్షణానైనా కృష్ణార్పణం కావచ్చు.

భాషాజాతీయుల సంస్కృతి మీద ఎక్కువ ఆధారపడి మాతృభాష ఉంటుంది. అది పరిణామశీలి. రాయిలా బిగుసుకు కూర్చోవటం దాని స్వభావం కాదు. ఈ పరిణామశీలతే లేకపోతే భాష త్వరగా వాడకాన్ని కోల్పోతుంది. భాషా పరిణామాలకు సాంస్కృతిక కారణాలే ప్రధానమైనవి.

అమ్మకడుపులో మావి పొరల మధ్య పెరుగుతున్న బిడ్డ మనసు అమ్మభాషలోనే రూపొందుతుందని పరిశోధనలు చెప్తున్నాయి. అమ్మకడుపులో బిడ్డ ఏ భాషలో పెరుగుతాడో ఈ భూమ్మీద పడిన క్షణం నుండీ ఆ భాషలోనే ఎదుగుతాడు. అనుక్షణం మనిషి మనసులో మెదిలే ప్రతి ఆలోచనా అతని మాతృభాషలోనే రూపుకట్టుకుంటుంది. భాషాబలం ఎక్కువగా ఉంటే ఆలోచనలో పరిణతి ఎక్కువగా కనిపిస్తుంది. ఒక శాస్త్రవేత్త నోబుల్ బహుమతి పొందగలిగే నూతన పరిశోధనలు చేయగలగాలంటే మాతృభాష మీద పట్టు కలిగి ఉండాలనేది ఇక్కడ ముఖ్య సూత్రం

దురదృష్ట వశాత్తు, మాతృభాషా ప్రాధాన్యతను తగ్గించే ప్రయత్నాలు వేగంగా జరుగుతున్నాయి. దైనందిన సామాజిక జీవనానికి ఉపయోగించటమే భాష లక్ష్యం అనీ, భాషకు అంతకుమించిన ప్రాధాన్యత అవసరంలేదని ఒక అభిప్రాయం బలంగా ఉంది. కమ్యూనికేషన్ ఒకటే భాష ప్రయోజనం అనేది వ్యక్తిత్వ వికాస నిపుణులు జనం బుర్రల్లో కెక్కిస్తున్న నిర్వచనం. భాషకు అంతకు మించిన మానసిక ప్రయోజనాలు ఉన్నాయనే విషయానికి గుర్తింపు లేకుండా పోతోంది.

ఇంగ్లీషు నేరిస్తే అమెరికాలో ఉద్యోగాలొస్తాయనీ, తెలుగు నేర్చుకుంటే ఏ ఉద్యోగాలు రావనీ గట్టినమ్మకం తల్లితండ్రుల్లోనే ఎక్కువగా వుంది. వాణిజ్య సంస్కృతి పెరిగిపోయాక భాషని, సంస్కృతిని కూడా బ్రతుకుతెరువు కోసం వాడుకోవాలనే ఆలోచన ఎక్కువైంది. బ్రతుకు తెరువుకోసం ఎవరు ఏ భాష నేర్చుకున్నా తప్పులేదు. ఏ భాషైనా నేర్చుకునే హక్కు ఉందికూడా! కానీ, మాతృభాషను నేర్పటం అనేది

ప్రాథమిక హక్కు. పరభాషను నేర్పటానికి అమ్మభాషను మరిచిపోవాలనటం రాజ్యాంగ విరుద్ధం.

సంభాషణా ప్రయోజనాన్ని నెరవేర్చటానికి భాష ఉపయోగపడుతుంది. దాన్ని కమ్యూనికేషన్ (నోటిమాట) నైపుణ్యం అంటారు. ఎదుటివాడికి అర్థం అయ్యేలా చెప్పటమే నోటిమాట నైపుణ్యం. కానీ, అమ్మ భాష ప్రయోజనం అంతకు మించినది. దానిది మనసు మాట. మనసు మాట బలంగా ఉంటే నోటిమాటలు కూడా బలంగా ఉంటాయి. Effective communication (శక్తివంతమైన నోటిమాట) అనేది 'మనసుమాట' యొక్క బలం మీద ఆధారపడి ఉంటుంది. మనం ఏం చెప్పదలచు కున్నామో దాన్ని అమ్మభాషలోనే ఆలోచిస్తుంది మనసు. నేర్చిన పరభాషలో మాట్లాడినా మనిషి అమ్మభాషలోనే ఆలోచిస్తాడు. రెండు భాషల మీదా పట్టు ఉన్నవ్యక్తి భావవ్యక్తీకరణ బలంగా ఉంటుంది.

మాతృభాష లేకుండా కేవలం పరభాషలో మనిషి మనసు చేయగలిగే వ్యాపారం ఏమీ ఉండదు. పరభాష కొన్ని పరిమిత అవసరాలకు మాత్రమే ఉపయోగపడుతుంది. కానీ, మాతృభాష ప్రాణప్రదమైనది. అది లేకపోతే మనిషి మానసిక బలహీనుడిగా మిగిలిపోతాడు. మాతృభాషాకాలుష్యాన్ని నివారించే యంత్రాంగాన్ని నెలకొల్పవలసిన అవసరం ఉంది.

**వాడుక తెలుగులో సంస్కృత పదాలు**

శ్రుతపాండిత్యం కారణంగా గ్రాంధిక తెలుగులోంచి కొన్ని సంస్కృతపదాలు జనసామాన్యాన్ని కూడా చేరతాయి. వాడుక భాషలోకి సంస్కృత పదాలను స్వీకరించే ఆత్రంలో అందరూ కలిసి బువ్వ, కూడు లాంటి స్వచ్ఛమైన తెలుగుపదాల్ని వాడకం లోంచి తప్పించేశారు. ఆంగ్ల వ్యామోహం తరువాత అన్నం అనే పదాన్ని రైస్ గానూ, భోజనాన్ని మీల్స్ గానూ పిలుస్తున్నాం. హోటల్లో వడ్డించేవాళ్ళు అన్నం కావాలా? అంటూ వడ్డిస్తే, అది బువ్వ, కూడు అంటూన్నట్టు వినిపిస్తుందని, అది తమ వ్యాపారానికి ఇబ్బంది కలిగిస్తుందనీ ఒక హోటల్ యజమాని అన్నాడు.

అసలీ అన్నం అనే పదం ఎక్కడిదీ? తెలుగులో దేశీ పదాలతో పాటు, సంస్కృత, పాళీ, ప్రాకృత, పర్షియన్, పోర్చుగీసు, ఇంగ్లీషు పదాలు లెక్కలేనన్ని కలిసిపోయి ఉన్నాయి. అన్నం అనేది సంస్కృత పదమే అనుకున్నా, భారత దేశంలో అన్నం అనే మాటని ఒక్క తెలుగువారు మాత్రమే వాడుతున్నారు. ఉత్తరాదివారు రోటీ అనీ, ఇతర దక్షిణాది వారు 'సాపాటు' అనీ అంటున్నారు. ప్రధాన భోజనాన్ని అన్నం అని తెలుగు వారు ఒక్కరే అంటున్నారు.

ఆప్టే సంస్కృత నిఘంటువు(పే.129) లో అన్నం అంటే, ఒక జాతి ప్రజలు, ఆంధ్రులు అనే అర్థాలున్నాయి. స్వయంగా ఆంధ్రుల్నే అన్నం పేరుతో పిలిచినట్టు ఆప్టే నిఘంటువు వలన తెలుస్తోంది. అలాగే, అంధ అనే పదానికి అన్నం, ఆంధ్రులు అనే అర్థాలు కనిపిస్తున్నాయి. మరణం లేని వారనే అర్థంలో అమృతాంధసులనే పదం కనిపిస్తుంది.

అంధకులు లేదా అంధసులంటే ఆంధ్రులే! జైనంలోంచి బౌద్ధంలోకి, బౌద్ధంలోంచి జైనంలోకి మతం మారి రెండు కళ్ళూ పోగొట్టుకున్న అంధకుడనే వాడి సంతతి ఆంధ్రులయ్యారనే ఓ జైనకథని మనమీద రుద్దారు. విశ్వామిత్రుడు శపించిన అతని నూర్గురు కొడుకుల్లో ఆంధ్రుడనే వాడున్నాడని అతని సంతతి ఆంధ్రులయ్యారనీ మరో కథని చెప్పి ఆంధ్రుల్ని శాపగ్రస్థులుగా చిత్రించారు. పురాణేతిహాస బ్రాహ్మణాలు భాషాజాతి పరంగా మనకు చేసిన అన్యాయం ఇది.

అంధ శబ్దానికి శాస్త్రీయ విశ్లేషణ జరగలేదు. ప్రోటో ఇండో యూరోపియన్ భాషలో 'అంథ్' శబ్దానికి మనిషి అని అర్థం. anthropology పదంలో anthos అంటే మానవ సంబంధమైన అని అర్థం. అంథ్ అంటే మనిషి, అంథ్ అంటే ఆంధ్రుడు. అంథ్ అంటే అన్నం. అన్నం అంటే ఆంధ్రుడు.

"అహమన్నం అహమన్నం అహమన్నం" అనగలిగే హక్కు, అన్నం బహుకుర్వీత, అన్నం న విద్యతే, అన్నం న పరిచక్షిత అంటూ అన్నకీర్తన చేయగలిగే హక్కు ఆంధ్రులకే ఉంది.

రెండు భాషల మధ్య పదాలు ఆదాన ప్రదానాలు రెండూ జరుగుతాయి. ఏకపక్ష వ్యాపనం ఉండదు. తెలుగులో సంస్కృత పదాలుగా భావిస్తున్న అనేక నుడులు అసలు సంస్కృతమే కాదని అవి సంస్కృతంలోకి వెళ్ళిన అరువు పదాలని ఎఫ్ బి జె క్వీపర్ అనే భాషావేత్త ఒక పట్టికని ప్రచురించాడు. క్వీపర్స్ లిష్టుగా ప్రసిద్ధి పొందిన ఈ పట్టికలో 383 పదాలున్నాయి. మచ్చుకు కొన్ని ఉదహరిస్తున్నాను:

| | |
|---|---|
| అంబ (అన్నం), | అగస్త్య( వ్యక్తి పేరు), |
| అంబర (ఆకాశం), | అపూప (అప్పాలు), |
| అగద(వ్యాధి లేకుండా ఉండటం) | ఇందు(చంద్రుడు), |
| ఇక్ష్వాకు ( వంశనామం), | ఉదుంబర(మేడి), |
| ఉలూఖల(రోలు), | ఉల్క (నిప్పు), |
| ఓదన (అన్నం), | కటుక (చేదు) |
| కపి(కోతి), | కరంభ ( గంజి), |

| | |
|---|---|
| కలశం (కుండ), | కుంభ(కుండ), |
| కుక్షి(కడుపు), | కుట(కుటీరం), |
| కుల (కులం), | కూల (నదీతీరం) |
| ఖదిర (చంద్ర చెట్టు), | గంగ (ఒక నది), |
| గణ (ఒక తెగ) | గాంధార (ఒక దేశ నామం), |
| చాగ (మేక), | చుబుక(బుగ్గ) |
| జఠర (పొట్ట), | జాహ్నవి (ఒక నది), |
| తస్కర (దొంగ), | దుందుభి (ఒక వాయిద్య విశేషం) |
| దూర్వ (ఒక రకం గడ్డి) | నీల(నీలం రంగు) |
| పలాశ (మోదుగ) | పిండ (అన్నపు ముద్ద), |
| పిపీలక(చీమ) | పిప్పల (పిప్పళ్ళు), |
| పురు (ఒక జాతి), | పురుకుత్స(ఒకజాతి) |
| ఫల (పండు), | ఫల (పండు, ఫలితం, భాగం, లాభం), |
| బధిర (చెముడు), | బల (బలం), |
| బలి (పన్ను, బలి ఇవ్వటం), | బిల (రంధ్రం), |
| బిల(గుహ), | మండూక (కప్ప), |
| మండూక (కప్ప), | మయూర(నెమలి), |
| మల (మలం), | ముద్గల(వ్యక్తి పేరు), |
| మూల (మూలం) | మూల(మూలం), |
| మేన(పల్లకి), | యదు(ఒక జాతి), |
| యయాతి(వ్యక్తి నామం), | లలాట (నుదురు), |
| లాంగూల(నాగలి), | వణిజ (వ్యాపారి), |
| విపాసా (ఒక నది పేరు), | శకుని (ఒక పక్షి) |
| శబర (ఒక జాతి), | శుల్క(వెల), |
| సరమ (దేవతల కుక్క) | సరయూ(ఒక నది) |
| సింహ(సింహం) | సుమంగళ (శుభం), |

గొప్ప సంస్కృత పదాలుగా ప్రసిద్ధిపొందిన ఎన్నో పదాలు క్వీపర్ పండితుడు

ఇచ్చిన పట్టికలో ఉన్నాయి. ఈ నుడుల్ని ఋగ్వేదంలోంచి ఏరి, వీటికి ఇండో యూరోపియన్ భాషా కుటుంబాల మూలాలు లేవని, ఇవి ద్రావిడ లేదా ముండా పదాలు కావచ్చునని (F.B.J. Kuiper, Aryans in the Rigveda, Amsterdam 1991) ప్రకటించాడు. భాషా పరిశోధనలో ఇదొక ముఖ్యాంశం

అగస్త్యుడు, లాంటి వ్యక్తినామాలు, గంగ లాంటి నదీ నామాలు, ఇక్ష్వాకు లాంటి వంశనామాలు, పిప్పలీ లాంటి వృక్షనామాలు ఆర్యులు ఇక్కడకు రావటానికన్నా ముందే ఇక్కడ నివసిస్తున్న స్థానిక భాషలకు చెందిన భాషల పదాలు అనేది నిస్సందేహం. ఈ స్థానిక భాషలు ద్రావిడ, ముండా మొదలైన జాతులకు సంబంధించినవి కావచ్చని క్వీపర్ ప్రతిపాదన.

ఈ 383 పదాల్లో కనీసం 200 తెలుగులో విరివిగా వాడకంలో ఉన్నాయి. వాటిని మనం సంస్కృతంలోంచి తెలుగులోకి వచ్చిన అరువు పదాలనుకుంటున్నాం. అవి తెలుగు ఇతర ద్రావిడ భాషల్లోంచి సంస్కృతంలోకి వెళ్ళినవి కావచ్చు. కోరాడ రామకృష్ణయ్యగారు తాళ, మీన, పుత్ర లాంటివి కూడా సంస్కృత పదాలు కావనీ తెలుగులోంచి వెళ్ళినవి కావచ్చునన్నారు.

తెలుగు భాష ఎల్లకాలం పుచ్చుకునే స్థితిలోనే (రిసీవింగ్ ఎండ్) ఉన్నదనేది వాస్తవం కాదు. మనవి ఇచ్చిన చేతులే! అనేక తెలుగు మాటలు సంస్కృతంలోకి వెళ్ళాయన్నది తిరుగులేని నిజం. తెలుగులో సంస్కృత పదాలు వచ్చినవా ఇచ్చినవా తేల్చాల్సిన బాధ్యత భాషావేత్తలదే! ఎల్లకాలం "జనని సంస్కృతంబు ఎల్లభాషలకు" అంటే చెల్లదు. పురాతన భావజాలం లోంచి అపూర్వ భావజాలంలోకి భాషాపరిశోధనలు వేగిరం కావాలి.

### మధ్య యుగాలలో సాంకేతిక పదాలు

మన కవులు, రచయితలు, భాషావేత్తలు పెద్దగా దృష్టి పెట్టకపోవటం వలన చాలా సాంకేతిక పదాలు తెలుగులో పదిలం కాకుండా పోయాయి. పదిలం చేయాలని ప్రయత్నించిన శ్రీనాథాదుల శ్రమని మనం విస్మరించకూడదు, మిలిటరీ సాంకేతిక తెలుగు పదాలను వ్రాసిన నాచన సోమనని అసలే మరిచిపోకూడదు. ఒక చిన్న పద్యం ఉదాహరణగా ఇస్తున్నాను.

"వంకదారులు(జేరి వాకిటి దద్దడం
    బులు సెర్చి, కొమ్మల మ్రోకు వైచి,
ప్రాకి లోపలజొచ్చి పలుగాడి దెఱచిన
    పంతగార్లకు మున్న, బ్రద్దపరులు

తోన నిచ్చెన లెక్కి లోని కొత్తళములో
బురణీంచి చొచ్చిన పోటు మగల
వా(డి మెచ్చక, యాళువరి మీ(ద బాళెల
వారి(దా(కించిన వాసి బిరుదు
లచ్చెరువు నొంద, మేడలు సొచ్చి, యూర్చు
దొడ్డకార్లచే(బఱి వోయె(దూర్పుదిక్కు,
ఱాల వాటుల, నేటుల, అంతు మిగిలి,
తఱిమి రచ్చటి బలము(గొందఱు గడంగి"

ఉత్తర హరివంశం తృతీయాశ్వాసంలో పద్యం ఇది! యాదవుల కోటమీద నడిరాత్రివేళ పౌండరీకుల దాడి జరిగిన తీరు వర్ణన ఇందులో కనిపిస్తుంది! కృష్ణుడి కోటను శత్రువులు స్వాధీనం చేసుకుని ఊరుని దోచుకున్నారు. ఈ పద్యంలో మనం మరిచి పోయిన వెయ్యేళ్ళ నాటి గొప్ప తెలుగు పదాలున్నాయి.

**వంకదారలు(జేరి :** మొదట వంకదారల్లోంచి శత్రు సైన్యం కోటను చేరిందట. వంకలంటే వాగుల్లాంటివి. బహుశా కోట లోపలికి నీరు రావటానికి నదిలోంచి వచ్చిన ఒక కాలువ ద్వారా ప్రవేశించారని అర్థం కావచ్చు కానీ, ఇది వంకదారి కాదు, వంకదార. కోట వాకిటి ముందర వంకదారలు అనే అర్థంలో ఇతర కవుల ప్రయోగాలు కూడా ఉన్నాయి. ప్రధాన ద్వారం లోపలి వైపు గడియ వేశి, దిగువ భాగంలో చిన్న ద్వారం వంగి లోపలకు వెళ్ళేలా ఉంటుంది. బహుశా అది వంకదార (wicket) కావచ్చు. శత్రు సైనికులు మూకుమ్మడిగా రాకుండా ఇది కొంతవరకైనా ఆపుతుంది కదా!

**వాకిటి దద్దడంబులు సెర్చి :** వాకిట్లో అంటే కోటకు బయటి భాగంలో దద్దడం లేదా దద్దళం అంటే బోడిమిద్దె. కోట బురుజు. సెర్చి అంటే దాన్ని చెరిచి, ధ్వంసం చేసేశారు.

**కొమ్మల మ్రోకు వైచి ప్రాకి లోపలజొచ్చి :** కొమ్మలంటే కోటమిద్దెల మీద ఉండే దిమ్మలు. వాటికి మోకు విసిరి ఉచ్చు వేసి పైకి ఎగబాకి కోట పైకి చేరారు.

**పలుగాడి దెఱచిన పంతగార్లకు మున్న :** పలుగాడి అనేది చిన్నదర్వాజా లాంటిది. పలుగాడి తలుపులు అంటే, చిన్నద్వారం లేదా రహస్య ద్వారం తలుపులు. ఇంతకు మునుపు వంకదార లోంచి మోకులేసి పాక్కుంటూ వచ్చి, బురుజు పైన ఈ పలుగాడి తలుపులు తెరిచి పంతగార్లు(శత్రు మూక)ముందుగా కోట నెక్కారట!

**బ్రద్దపరులు తోన నిచ్చెన లెక్కి :** బ్రద్దపరి అంటే ఒక విధమైన పేనుతో చేసిన డాలు. ఇప్పటి రిజర్వ్ పోలీసులు కూడా రాళ్ళ దాడులు జరుగుతున్నప్పుడు పేనుతో అల్లిన పొడవైన రక్షణకవచాన్ని వాడతారు. ఈ డాలు పుచ్చుకున్న సైనికులు నిచ్చెన

లెక్కుతుంటే కోటపైన ఉన్న సైనికులు రాళ్ళు విసిరి, కోటమీంచి ఎగబ్రాకే వాళ్లను అడ్డుకుంటూ ఉంటారు. రాళ్ళూ తగలకుండా బ్రద్దపరి అవసరం ఉంటుంది.

**లోని కొత్తళములోఁ బురణించిఁచొచ్చిన పోటు మగల వాఁడి మెచ్చక :** కొత్తడం లేదా కొత్తళం అంటే కోట బురుజు మీద నడిచేందుకుండే దారి. పురణించటం అంటే శత్రువు పురోగమించటం, చొచ్చిన అంటే దూసుకొచ్చిన, పోటూమగలువ వీర సైనికులు, వాడి మెచ్చకవఇంత గొప్పగా కోటని ఆక్రమించేందుకు దాడి కొచ్చిన వీరుల్ని లెక్కచేయకుండా,

**యాళువరి మీఁద బాళెల/వారిఁ:** ఆళువరి, ఆలంగం, కొత్తడం ఇవి బురుజుల్లాంటివే! ఒక్కో నిర్మాణానికి, ఒక్కో పేరు ఉండి ఉంటుంది. మన కోటలన్నీ ధ్వంసమైనవే కాబట్టి వాటిని గుర్తించ లేకపోతున్నాం. పాళెలు అంటే, పాలెగార్లు,

**దాఁకించిన వాసి బిరుదు లచ్చెరువు నొంద :** తాకించిన-యుద్ధంలో చావగొట్టిన, వాసి బిరుదులు గొప్ప పేరున్న యోధులు, అచ్చెరువు నొంద- ఆశ్చర్యపడేలాగా

**మేడలు సొచ్చి :** అంటే నగరం లోకి ప్రవేశించి ప్రజల ఇళ్ళ మీద దాడి చేశారు. ఆర్చు- పెద్దగా అరచు, అరిచి హడావిడి చేశారు. దొడ్డకార్ల చేన్- దొడ్డకార్లంటే కొల్లగొట్టటానికి వచ్చిన వాళ్ళతో

**బఱి వోయెఁదూర్పుదిక్కు :** తూర్పుదిక్కు పగిలిపోయిందట (the dawn broke). అంటే సూర్యోదయం అయ్యింది. అప్పటి దాకా అంతా విధ్వంసమే కాబట్టి, చీకటి పోయి వెలుతురు రావటాన్ని తూర్పుదిక్కు పగిలిందంటాడు కవి!

**ఱాల వాటుల, నేటుల, ఱంతు మిగిలి, తఱిమి రచ్చటి బలముఁగొందఱు గడంగి :** ఇళ్ళు కూలగొడ్తుంటే తగిలిన దెబ్బలకీ, దాడి చేయటం వలన తగిలిన దెబ్బలకీ జనం గగ్గోలు (ఱంతు) పెడుతుండగా మిగిలిన యాదవ వీరుల్ని అక్కడినుంచి తరిమేసినప్పుడు భళ్ళున తెల్లవారిందట. ఇక్కడ ఱంతు అంటే కలకలం. రంతు అంటే రతి సంబంధమైన అని అర్థం. ఖచ్చితమైన అర్థం కావాలంటే 'ఱ (శకట రేఫ (ఱ) వర్ణం ఉండాల్సిందే! ఇప్పుడు ఆ పదాన్ని మనం వాడకపోయినా ఒకప్పుడు వాడిన దాన్ని చదవటానికైనా వర్ణం ఉండాలి కదా!

ఈ మొత్తం పద్యంలో వంకదార, దద్దడం, పలుగాడి, బ్రద్దపరి, ఆళువరి, ఆలంగం, కొత్తడం, పంతగారు ఈ పదాలన్నీ మిలటరీ సాంకేతిక పదాలు. మనం మరిచిపోయినవి. యుద్ధానికి, కోటకు పసంబంధించే ఇన్ని తెలుగు పదాలున్నాయంటే లోతుగా అధ్యయనం చేస్తే ఇంకా ఎన్ని దొరుకుతాయో కదా! "యాళువరిమీద పాళెలు" చక్కని పదాల కూర్పు. పాలెగార్లు రెడ్డిరాజుల కాలం లోనే ఉన్నారని కూడా అర్థం అవుతోంది.

భాషను బ్రతికించుకోవాలనే శ్రద్ధ ఉంటే ఆధునిక సాంకేతిక పదజాలాన్ని తెలుగులోకి తేవటం అసాధ్యమేమీ కాదు. అయితే ఆ ప్రయత్నం మరింత జాగ్రత్తగా జరగవలసి ఉంది. కొందరు అచ్చతెలుగు పేరుతో సృష్టిస్తున్న పదజాలం చాలా కృతకంగా ఉండటం వలన వాటికి జనామోదం కష్టం అవుతుంది. ఈ తెలుగు కన్నా ఆ ఇంగ్లీషేనయం అని మూలనున్న ముసలాయన అనే పరిస్థితి ఉండకూడదు.

ఆరొందల యేళ్ల నాటి డ్రెస్'కోడ్ గురించి ఈ చిన్న పద్యాన్ని చూడండి, ఎన్నో వివరాలు తెలుస్తాయి:

"పట్టే తిరుమణులును పట్టుకుళ్ళాయిలు
పట్టుదుప్పటు లఱచట్టలు మెఱయ
దిట్టలౌ విద్వాంసులు ధీరులౌ కవులు
పట్టభద్రుని కొలువుకు వచ్చిరావేళ"

దక్షిణాది రాజ్యాలలో ఎక్కువ విదేశీ యాత్రికులు, దేశంలోనే ఇతర రాజ్యాలకు చెందిన వర్తకులు, కవి పండిత కళాకారులూ ఎక్కువగా సందర్శించింది విజయనగర సామ్రాజ్యాన్నే! వాణిజ్యం పెంచుకునేలా రాజు పాలన చేయాలని కృష్ణదేవరాయలు స్వయంగా ఆముక్తమాల్యదలో చెప్పుకున్నాడు కూడా! అందుకని, కొన్ని ఆధునిక సాంప్రదాయాలను తప్పనిసరిగా పాటించవలసి వచ్చింది. రాజాస్థాన సందర్శకులకు డ్రెస్'కోడ్ వాటిలో ఒకటి.

"కుళ్ళావెట్టితి కోకసుట్టితి మహా కూర్పాసముం దొడ్గితిన్" అని శ్రీనాథుడు ప్రౌఢదేవరాయ కాలంలో విజయనగర సామ్రాజ్య సందర్శనం చేసినప్పుడు తానుకూడా డ్రెస్ కోడ్ పాటించినట్టు చెప్పుకున్నాడు. దాన్నిబట్టి, రాజ సందర్శనం కోరేవాడు ప్రత్యేకంగా నిర్దేశించిన వేషధారణలోనే రావాలని అర్థం అవుతోంది.

తరువాతి కాలంలో తంజావూరు మధుర రాజ్యాల లోని తెలుగు పాలకులు ఈ వేషధారణ విధానాన్ని కొనసాగించారు, నాయకరాజులు తాము స్వయంగా వ్రాసిన రచనల్లో వీటి వివరాలు కొన్ని మనకు తెలుస్తాయి. ఈ పద్యం'విజయరాఘవ కళ్యాణము' లోది.

**పట్టే తిరుమణులు :** తిరుమణి అంటే తెల్లటి నాము, తిరుచూర్ణం అంటే పసుపు, బియ్యప్పిండి కలిపిన పొడి. ఈ రెండింటినీ వైష్ణవులు నొసట బొట్టులా పెట్టుకుంటారు. రాజు వైష్ణవు డైనప్పుడు ఆయన మెప్పుకోరి వచ్చిన వాడు ఈ వైష్ణవ సాంప్రదాయాన్ని విధిగా పాటిస్తాడు. నుదుట బొట్టు లేని శూన్యలలాటాన్ని రాజు ఆదరించక పోవచ్చు

కూడా! ఈ బొట్టుని పట్టె(పలకలా)లాగా పెడతారు. రాజు పట్టాభిషిక్తుడయ్యేప్పుడు పెట్టేబొట్టు ఈ 'పట్టె'

**పట్టుకుళ్ళాయిలు :** కుళ్ళా-య, కుళ్ళాయి అంటే పటరచిత మకుటం. పట్టుబట్టతో చేసిన తలపాగా. వీటిని మొదట్లో కుళ్ళాయిలనే అనేవారు. ఇది దొరల టోపీ కాదు. ముట్నూరి కృష్ణారావుగారి తలపాగా కూడా కాకపోవచ్చు. గాంధీటోపీ లాంటిది, పట్టుబట్టతో చేసింది కావచ్చు. తరువాతి కాలంలో పాగా అనేది వ్యాప్తిలోకి వచ్చినట్టు నిడుదవోలు వేంకటరావుగారు వ్రాశారు. తమ కవితా ప్రతిభతోనో, కళా ప్రతిభతోనో రాజుగారి మెప్పుపొందిన వాళ్లకి రెండు శాలువాలు బహూకరించే సాంప్రదాయం ఉండేది. ఒకటి పైన కప్పి, రెండోది తలపాగాలాగా చుట్టి, గౌరవించే వాళ్లన్నమాట! శాలువాల జతని దౌశాలువా లేక దుశ్శాలువా అన్నారని పండితులు చెప్తారు. తలపాగా పెట్టుకొని కోటకెళ్ళటం, కోటలో తలపాగా పెట్టించుకు రావటం అనేవి రెండూ గొప్ప విషయాలే ఆ రోజుల్లో! కోటలో పాగా వేయటం అనే మాట ఇలానే పుట్టింది.

**పట్టుదుప్పటులు :** దుప్పటం అంటే వెలగల సన్నపాటి వెడల్పు వస్త్రం, కవచం, ఉత్తరీయం, నిచోళం అని నిఘంటు అర్థాలు. వెడల్పు తక్కువ, పొడవు ఎక్కువగా ఉండే శాలువాని దుప్పటం అన్నారు. అది పట్టుదైనప్పుడు ఖరీదైనదౌతుంది. పక్కమీద వేసుకోవటానికి, ఒళ్ళంతా కప్పుకోవటానికీ వాడుకునే ఇప్పటి దుప్పటిని కూడా దుప్పటం అనే అంటారు. దానికీ దీనికీ చేతలో తేడా ఉంటుంది. లేకపోతే దుప్పటి కప్పినట్టే ఉంటుంది గానీ, శాలువా లాగా ఉండదు.

**అఱచట్టలు మెఱయ :** అఱచట్ట అంటే 'నేటి వెయిస్టు కోటు వంటిది' అన్నారు నిడుదవోలు వేంకటరావుగారు

శ్రీనాథుడు తాను ప్రౌఢదేవరాయల సంస్థానానికి వెళ్ళినప్పుడు కోక చుట్టుకుని, మహాకూర్పాసం తొడుక్కున్నట్టు వ్రాసుకున్నాడు. మహాకూర్పాసకం అంటే బాగా ఖరీదైన జరీ అంచులున్న ఈ అఱచట్టే! అవిక లాంటిదన్నమాట. అది సాధారణంగా ఉంటే బనీను (లోగుడ్డ) లా ఉంటుంది. రాజదర్శనానికి వచ్చేవాళ్ళు అర్థనగ్నంగా నడుం నుండి పైభాగం కనిపించే విధంగా ఉండకుండా, ఇలా అఱచట్ట లేదా కూర్పాసం తొడుక్కుని పైన పట్టు దుప్పటం (ఉత్తరీయం) కప్పుకునేవాళ్ళు. ఇదే జనవ్యవహారంలో అంగరకా లేదా అంగరఖా అంటే చొక్కాగా మారింది. క్రమేణా పై ఉత్తరీయం లేచిపోయింది.

పంచె కట్టుకుని, దాని మీద కోక చుట్టేవాళ్ళు. పంచెమీద బెల్టులాగా నడుము చుట్టూ బిగించి కట్టే వస్త్రాన్ని కోక అంటారు. యజ్ఞ యాగాది క్రతువుల్లో నడుము

బట్ట కట్టుకోవటం అంటే దీక్షకు ఉపక్రమించటం అని అర్థం. కోకచుట్టటానికి అంత ప్రాముఖ్యం ఉంది. మిగతా వస్త్రధారణలు పాటించగలిగినా లేకున్నా, నడుముకు వస్త్రం కట్టటం వరకూ చేస్తే, గొప్ప గౌరవం ఇచ్చినట్టే భావించేవాళ్ళు. ఇవన్నీ దేవాలయాలకు వెళ్ళేప్పుడు కూడా సహజంగా పాటించే నియమాలే! రాజాస్థానాలక్కూడా వీటిని వర్తింప చేయటం ద్వారా గౌరవం ఆపాదించే ప్రయత్నంగా దీన్ని అర్థం చేసుకోవచ్చు.

సందర్భవశాత్తూ ఇక్కడొక సరదా సంగతి చెప్పాలి.

తంజావూరు నాయకరాజుల కాలంలో "తీరైన కనకపు కళ్ళజోడు దీపింపగా" రాజదర్శనానికి తరలి వచ్చినట్టు ఒక పద్యాన్ని నిడుదవోలు వారు ఉదహరించారు.

కళ్లకు అద్దాల గురించిన పర్జినం మనకు 18వ శతాబ్దికి గానీ అందుబాటులోకి రాలేదు. కాబట్టి బంగారపు కట్లున్న కళ్లజోడు వాడకం కంటి దోషాలకోసం (refraction errors) ఇప్పుడు మనం వాడే కళ్ళజోడు లాంటిది కాదని, రేబాన్ కళ్లజోడు లాగా విలాసవంతమైన ఒక అలంకారం అనీ అర్థం అవుతోంది. ఇది అద్దాలున్న జోడా లేక ఉత్తుత్తి ఫ్రేము మాత్రమే ఉన్నదా, దాని ఆకారం ఎలా ఉండేది అనేవి మనకు తెలీవు. ఎక్కడైనా ఏ దేవతా విగ్రహానికో, రాజుగారి విగ్రహానికో కళ్ళజోడు ఉన్నదేమో తెలీదు. అప్పటి సాంఘిక చరిత్ర తెలుసుకోవటానికి ఇవన్నీ ముఖ్య పరిశోధనాంశాలే!

## వాడుకభాషా రక్షక వ్యవస్థ

మనం ఇంగ్లీషులోంచి ఏరి తెచ్చుకున్న పదాలను వచ్చినవి వచ్చినట్టుగా వాడుకుంటున్నాం. వాటిని కలుపుకుని తెలుగును సుసంపన్నం చేసేందుయ్కు ప్రయత్నించ లేకపోతున్నాం గుడికెళ్లి కొబ్బరికాయ కొట్టి రా అనటానికి బదులుగా "టెంపుల్ కెళ్లి కోకోనట్ బ్రేక్ చేసిరా" అనటం వలన ఇక్కడ కోకో నట్, బ్రేక చేయటాలు మనకు ఉపయోగపడిందేమీ లేదు. పైగా చక్కని తెలుగు మాటల్ని కలుషితం చేశాయి. ఇదంతా సాహిత్య భాషలో జరుగుతున్న తంతు కాదు, ఇది వాడుక భాషలో, ఏర్పడుతున్న కాలుష్యమే! ఏ తరగతి ప్రజలు ఈ కాలుష్యానికి కారకులౌతున్నారో ఒక్క సారి ఆలోచిస్తే ఉన్నత తరగతి, ప్రజలవైపే వేళ్ళు చూపెడతాయి. సగం చదువుకున్నవాళ్లవలన కలుగుతున్న అపకారం ఇదంటే ఇంకా సబబుగా ఉంటుంది.

**తెలుగేననిపించే ఇంగ్లీషు పదజాలం ఎలా ఉంటుందో మచ్చుకు కొన్నింటిని చూద్దాం:**

ఆఫీసరొప్పుకోడు
ఇంజన్ ఆనయ్యింది
ఇంటర్నెట్ వీగ్గా ఉంది
ఎగ్గు కర్రీ టేస్టీగా ఉంది
ఒబలైజ్ చేశాడు
ఓటేసొచ్చా!
కంప్యూటర్ సిస్టంలో పెట్టాను
కథలో ట్విస్టదే!
కప్పు బ్రేకయ్యింది
కాటన్ శారీ కట్టింది
కామెడీ ఫిల్ము ఇది
కారు బ్రేకుడౌనైంది
కిక్కెక్కింది
కూల్‌డ్రింకులో పెస్టిసైడ్లు
కోటూ బూటూ వేసుకున్నాడు
క్యాంపు కెళ్లారు
క్యాషిచ్చాడు,
క్రీము రాసుకుంది
గన్నుందక్కడ
గోల్డుప్లేట్లలో తింటారు
గ్యాసు రాలేదు
గ్లాసులో వాటరు
జడ్జి గారు లీవులో ఉన్నారు
టాక్స్ పడింది
టాపిక్ మార్చండి
టికెట్టు బుక్కుడు
టిప్పు ఇచ్చాడు
టెలిఫోను లైన్ కట్టయ్యింది
టెలివిజన్లో చానల్స్
టేబులు పైన డస్టు క్లీన్ చెయ్యి
టైం టేబుల్
ట్రక్కుల్లో తెచ్చారు.
ట్రెజరర్ సైన్ చేయాలి
ట్రైనులేటు
డల్లుగా ఉన్నాడు
డాక్టర్రాలేదు
డ్యూటీ నర్సు
డ్రై క్లీనింగు
థిక్కుగా ఉంది
థియేటర్ హౌస్‌ఫుల్లు
నంబరింగు ఓవర్
నీడిల్లో త్రెడ్డు ఎక్కింది
పర్సులో క్యాష్ లేదు
పాస్‌పోర్టు రాలేదు
పెన్ను క్యాపు
పెన్నుతో రైటింగ్ కుదరదు
పెన్సిలు మార్కు పెట్టండి
పేపరు వెయిట్
పేరెంట్లను రమ్మనండి
పోష్టర్ లెస్ సిటీ

ప్యాంటు లూజుగా ఉంది
ఫిట్టుగా ఉంది
ఫోన్లో చెప్పాను
ఫోర్కులతో తినాలి
బటన్లు లేవు
బాయిలేరు ఆన్ చేశారు
బిల్డింగ్ ఓపెనయ్యింది
బుక్కుల్లో రాశారు
బోటు వేశారు
బ్యాటరీ హీటెక్కింది
బ్రష్షు వాడండి
మెజర్ చేసే చెప్తున్నా
మేరేజీ జరిగింది
మోటారు కారు
మ్యూజిక్ అంటే ఇష్టం
యాక్టులో క్లియరుగా ఉంది
రఫ్ఫాడాడు
రింగయ్యారు
రేడియో ఆన్ చెయ్యి
లెదర్ పీసులతో చేశారు
వారు నడుస్తోంది
వులెన్ స్వెట్టర్
సర్కస్ ఫీట్
సిక్కులీవు
సిల్కు షర్టు
స్కర్టు వేసుకుంది
స్ట్రెస్సులో ఉంది

ప్రిన్సిపాలు ఫైరయ్యాడు
ఫిల్టరు చేశాడు
ఫోమ్ బెడ్డు
బందయ్యింది
బల్బు వెలిగింది
బాలాడాడు
బిల్లివ్వు
బేరేజీ మీంచి వెళ్లు
బ్యాంకులో ఉన్నాను
బ్యాటుకి తగిలింది
బ్రిడ్జి కట్టారు
మెట్రో రైలు
మైకులో చెప్పు
మ్యాపులో ఉంది
యంగ్ పీపులు
యెల్లో పేజీలు
రాంగానస్సర్
రేజర్ బ్లేడు
లెటరు పోష్టు చెయ్యి
వాడు ఫెయిలయ్యాడు
వార్డు మెంబరు
వెట్ పార్టీ
సాసర్ తేలేదు
సినీమా వచ్చింది
సీటు బెల్టు
స్కూటర్ రిపేరుకొచ్చింది
నో స్మోకింగ్

హండ్రెడ్ యార్డ్స్ ఉంటుంది　　　　　హాస్పిటల్లో డాక్టర్లు లేరు

హిట్టయ్యింది　　　　　　　　　　హౌసులోనే ఉన్నాను

ఈ పదజాలాన్నంతా మనం ఉన్నత తరగతి వ్యక్తులు తెచ్చి పోగేస్తున్న చెత్త అనే మనకు అర్థం అవుతుంది. వీటిని బలవంతంగా జనసామాన్యం మీద రుద్దటానికి ప్రసార, ప్రచార మాధ్యమాలు తగినంతగా శ్రమిస్తున్నాయి. ఇది అపకారం, అపచారం, అపాయం అనే ధ్యాస లేకపోవటాన ఇలా జరుగుతోంది.

ఉన్నత తరగతి ప్రజల సంకర భాషను మనం ప్రజల భాషగా భావించ కూడదు. ఇంట్లో మమ్మీ డాడీ పిలుపు తెచ్చింది ఉన్నత తరగతి వాళ్లే! దాని ప్రభావం జనసామాన్యం మీద పడకుండా మనం ఆపలేము. అత్యంత దిగువన ఉన్న ప్రజానీకంలో కూడా ఈ ఇంగ్లీషు భాషా వ్యామోహం పెరగటానికి మీడియా చర్యలు ఎక్కువగా దారి తీస్తున్నాయి. దీన్ని నివారించేందుకు మనకో "నుడికావలి వ్యవస్థ" ఏర్పడ వలసిన అవసరం ఉంది. అడిగేవాడు లేకపోవటం, లేదా చేతకానివాడు కావటాన సినిమాలు, పత్రికలు, టివీ ఛానళ్లూ భాషా కాలుష్యానికి కారకులౌతున్నారు. 'అడిగే వ్యవస్థ' ఏర్పడకపోతే తెలుగు నేలమీద తెలుగు మాట్లాడటం నేరం అయ్యే పరిస్థితి దాపురిస్తుంది. ముఖ్యంగా ఎలక్ట్రానిక్ మీడియా పరోక్షంగా భాష మరణానికి చేయ గలిగినంత చేస్తోంది. వాణిజ్య సంస్కృతిలో ఇవి సహజమే! ప్రభుత్వం తన అదుపు బాధ్యతని గుర్తించకపోతే భాషకు చేటే!

భాషా కాలుష్యానికి మాతృభాషాభిమానం, గౌరవం లేని పాలనా వ్యవస్థ కారణంగా మాతృభాషకు వ్యతిరేకంగా మారిన విద్యావ్యవస్థ, మాతృభాష ప్రాధాన్యతను గుర్తించని తలిదండ్రులు, తెలుగులో పాలన కుదరదనే ఉన్నతాధికారులు ఈ అందరూ అమ్మభాష హంతకులే! పెనుప్రమాదంలో ఉన మాతృభాషల పట్టికలో తెలుగు భాషను కూడా యునెస్కో చేర్చింది. వ్యాకరణ రక్షణలో ఉన్న గ్రాంథిక తెలుగు భాషకు ఈ దుర్గతి ఎన్నటికీ పట్టదు. సంస్కృతం హిబ్రూ లాంటి భాషల్లాగే మాట్లాడే వారు లేకపోయినా అవి బ్రతికుంటాయి. తెలుగు గ్రాంథికానిక్కూడా అలానే మరణం ఉండదు. కలవరం అంతా వాడుక తెలుగు గురించే! టెంపులుకు వెళ్ళి కోకోనట్ బ్రేక్ చేసింది బస్సు రోడ్డున స్పీడుగా పోతోంది...లాంటి తెలుగు వాక్యాల్లో చేసింది పోతోంది మాత్రమే తెలుగు మాటలు. అవి కూడా ఎప్పుడు పోతాయో చెప్పలేం. మనం తెలుగు వాళ్ళుగానే ఉంటాం. తెలుగే మాట్లాడుతున్నాం అనుకుంటాం. కానీ అందులో తెలుగు ఉండని పరిస్థితి వస్తుంది. ఇదే భాషా కాలుష్యం ఫలితం!

భాషాకాలుష్యం అంతా వాడుకభాషలోనే జరుగుతోంది. వ్యాకరణ రక్షణ లేకపోవటాన చొరబాటుదార్లు అతిక్రమణదార్ల తాకిడి ఎక్కువయ్యింది. ఈ దుండగీలను

అరికట్ట లేకపోతే తెలుగు భాషాంతాన్ని మనం కళ్ళారా చూసే ప్రమాదం పొంచి ఉంది. యునెస్కో చేసిన హెచ్చరికను ప్రభుత్వం పట్టించుకోవాల్సిన సమయం ఇది. భాషను కాపాడే "నుడికావలి" వ్యవస్థను నిర్మించి ప్రాధికారికతను కల్పించటం కాలుష్యకారుల్ని పట్టి శిక్షించే అధికారాలను కల్పించటం నేటి అవసరం.

**వాడుకభాష-వ్యాకరణాంశాలు**

గ్రాంథికం, వ్యావహారికం అని మనం అన్నట్టే ఇంగ్లీషు వాళ్లు కూడా ఫార్మల్, ఇన్ఫార్మల్ పదాల్ని వాడతారు. Formal, academic, conventional సందర్భాల్లో వాడే భాష ఫార్మల్ భాష. పుస్తకాల్లో వ్రాసినట్టుగా మాట్లాడటాన్ని ఫార్మల్ అనీ, స్నేహితులు సరదాగా మాట్లాడేప్పుడు వాడుకునే భాషని ఇన్ఫార్మల్ నీఅంటారు. 'కాజువల్ లాంగ్వేజి' అనికూడా అంటారు.

బట్టల కొట్టుకు వెళ్ళి'చొక్కాలు కావాలనడిగితే ఫార్మల్సా? ఇన్ఫార్మల్సా? అనడుగుతారు. క్యాజువల్స్ ఉన్నాయంటారు. వాడుక భాష రానివాళ్లకి ఈ పదాలు తికమకగా అనిపిస్తాయి. మనలో చాలా మంది చదువరులకు అసలైన వాడుకభాష లేదా జనవ్యవహార భాష తెలీదు. సామాన్య ప్రజల భాషలో 'టిక్కా టీ' అంటే 'పంచదార లేని టీ' అనీ 'టిక్కా చారు' అంటే చింతపండు వెయ్యని చారు (రసం) అనీ ఎంతమందికి తెలుసు? టిక్కా అనేది పంజాబీ పదం. 'చప్పగా కాల్చినది' అని దాని భావం. కాల్చటం లోనే దీని ప్రత్యేకత. మాంసం ముక్కల్ని(కట్'లెట్స్) కాల్చి టిక్కా వంటకం తయారు చేస్తారు. విదేశాలలో ఈ 'టిక్కా' పదం బాగా ప్రచారంలో ఉంది. దాన్ని తెలుగులో టీ పప్పుచారు లాంటి వాటికి వాడటం ఒక ప్రత్యేకత. దీన్ని పంజాబీ వాడు వచ్చి మన మీద రుద్దలేదు. మనమే తెచ్చుకున్నాం తెచ్చి కలుపుకున్నాం. కలిపి విస్తరించుకున్నాం. 'టిక్కా టీ' అంటే 'చప్పని టీ' అని!

ప్రతీ భాషా ఆ భాషా జాతీయులకు ప్రియమైనదీ ఘనమైనదీ పవిత్రమైనది కూడా! తరాలుగా భాష తాత ముత్తాతల నుండీ మనుమలు మునిమనులకూ సంక్రమిస్తూనే వస్తుంది.

క్యాజువల్ సంభాషణలో తక్కువ సమయంలో ఎక్కువ మాట్లాడేలా భాషని వేగంగా పలకటం కనిపిస్తుంది. "నీవు ఏ దిశకు జనుచుంటివి?" అనటం శుద్ధ గ్రాంథికం. "ఎక్కడి దాకా వెడ్తున్నావు?" అనడగటం సరళ గ్రాంథికం. "ఎందాకా పోతున్నావు?" అనడం శుద్ధ వ్యావహారికం(ఫార్మల్). 'యాడికి బోతన్నవ్?' అనడం జనవ్యావహారికం. ఇదే క్యాజువల్ లేదా ఇన్ఫార్మల్ భాష. సాధారణ జనానికి ఇదే అర్థం అవుతుంది.

మన వ్యాకరణ నియమాలన్నీ ఈ గ్రాంథిక భాషకే వర్తించేవిగా ఉన్నాయి.

సామాన్య మానవుడి భాషకు గుర్తింపు లేకుండా పోతోంది. దాని సంగతిని వ్యాకరణవేత్తలు పట్టించుకోగలిగితే, వ్యాకరణం విస్తరిస్తుంది. భాష కూడా విస్తరిస్తుంది.

గ్రాంథికానికి యాస ఉండదు. మాండలికం(డయలెక్టికల్ వేరియషన్) అనేది కేవలం జనభాషలోనే కనిపిస్తుంది. precise, unambiguous language లో సరళత, స్వచ్ఛత, సంక్షిప్తత, వేగం ఉంటాయి. ఇవి జనవాక్కుల్లో చక్కగా కనిపిస్తాయి. జనభాషలో ధ్వనించేది ఆ వక్త హృదయమే!

ఏ సంభాషణైనా ఎవరిని ఉద్దేశించి మాట్లాడుతున్నాం అనే దానిమీద ఆధారపడి నడుస్తుంది. ఇష్టమైన అతిథి ఇంటికొస్తే "రండి! రండి! దయచేయండి!" అంటాం...! మంచి మిత్రుడొస్తే "రావోయ్, వచ్చి కూచో" అంటాం! ఇష్టం లేని వ్యక్తి వస్తే "లోపలికి తగులడు" అంటాం! శ్రోతని బట్టి భాష మారుతోంది. మనం కాయితం మీద వ్రాసే భాష వేరు. మైకు ముందు మాట్లాడే భాష వేరు. ఆడవాళ్లు, పెద్దవాళ్లు ఉన్నప్పుడు వాడే భాష వేరు. సరదాగా స్నేహితుల్తో మాట్లాడేప్పుడు వాడే భాష వేరు. ఇంట్లో పెళ్లాం పిల్లలతో మాట్లాడే భాష వేరు. వ్యక్తి ఒక్కడే ఇన్ని రకాలుగా మాట్లాడుతున్నాడు. ఇవన్నీ భాషలో వివిధ రూపాలుగా అర్థం చేసుకోవాలి. దీన్నే conversational tone అంటారు. సంభాషించే వ్యక్తి 'టోన్' ముఖ్యమైంది.

పూర్వం కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, తన ఇంట్లోవాళ్లతో కూడా గ్రాంథికమే మాట్లాడేవారట. బిచ్చగాడొస్తే, "ఓయి భిక్షుకా! మా గృహమ్మున నేడు తండులమ్ములు నిండుకున్నవి. నేడు పోయి రేపు రమ్ము" అనేవాడని చెప్తారు. శ్రోతతో నిమిత్తం లేకుండా తన ధోరణిలోనే మాట్లాడితే అన్ని చోట్లా చెల్లదు కదా!

తెలుగులోనే కాదు, ఇంగ్లీషులో కూడా పామరభాషకు వ్యాకరణ సూత్రాలు లేవు. ఆంగ్లభాషలో పదాల సంఖ్య ప్రతీ ఏడాదీ పెరుగుతోంది. కానీ, దాని గ్రంథస్థ భాష తీరులో మార్పులేదు. పామరభాష హద్దులు దాటి కొత్తపుంతలు తొక్కుతూ పోతోంది. దాని వేగాన్ని ఇంగ్లీషు వ్యాకరణ వేత్తలు అందుకోలేక పోతున్నారు. నాగరకత వ్యాప్తమౌతున్న కొద్దీ కొత్త వస్తుసంపద, కొత్త అవసరాలు ఏర్పడుతున్న కాలంలో భాష కూడా ప్రధాన పాత్ర వహిస్తుంది. అది సక్రమంగా వాడకంలోకి రావలసిన అవసరం ఉంది.

ఫార్మల్ భాషలో "వోటర్స్ ఆర్ వోటింగ్" అనాలి. కానీ 'వోటర్స్ ఈజ్ ఓటింగ్' అనటం ఇన్ఫార్మల్ భాష. మొన్న ఒకవిడ "అక్కడ చాలా మందులున్నారు" అన్నది. ఇంకొంతమంది ఇలానే మాట్లాడితే పదుగురాడుమాట పాడిగాదే అన్నట్టౌతుంది. వ్యాకరణ సూత్రాలేవీ ఈ పరిణామాల్ని ఆపలేవు. క్యాజువల్ లేదా కొలోక్వియల్ రీతి దానికదే ఊటబావిలో నీళ్లలా పుట్టుకొస్తుంది.

సుందరమైన, అందమైన అనేమాటలకు బదులుగా తెలుగువాళ్ళు ఇప్పుడు "క్యూట్" అనడం ఎక్కువయ్యింది. కొన్నాళ్ల క్రితం ఎక్యూట్'గా వచ్చిన ఈ 'క్యూట్' పదం రైలు, రోడ్డు, బస్సు లాగానే తెలుగు మాటై పోతుంది. బస్సు రోడ్డున స్పీడుగా పోతోంది అనేది నాలుగు పదాల తెలుగు మాటే! అందులో పోతోంది ఒక్కటే తెలుగు. అది కూడా ఎప్పుడు పోతుందో తెలీదు.

రెఫ్రిజిరేటర్ని, ఫ్రిజ్జు అని కుదించి పలుకుతున్నాం. టీవీ, ఫోను, సెల్లు ఇవన్నీ ఇలాంటి వ్యావహారిక రూపాలే! 'ఓకేఏవై' అని వ్రాయటానికి బదులు 'ఓకే' అని కుదించి వ్రాస్తున్నాం. 'సరియే కానిమ్ము' అనటానికి 'సర్లే' అంటున్నాం కదా!

ILU, B4U, GM లాంటి కుదింపులన్నీ మారిన కాలమాన పరిస్థితులకు సాక్ష్యాలు. ఎస్సెమ్మెస్సుల భాష తెలుగు మీద కూడా బాగా ప్రభావం చూపిస్తోంది.

ఈ మిలీనియం తరువాత ప్రపంచవ్యాప్తంగా కమ్ముకున్న వాణిజ్య సంస్కృతి పుణ్యాన ఆంగ్లంలో చాలా మార్పు కనిపిస్తోంది. "గుడ్'కు బదులుగా బెనిఫిషియల్ అనీ, 'బాడ్' అనటానికి డెలెటేరియస్ అనీ, నైస్ అనటానికి ప్లెజెంట్ అనీ వాడుతున్నారు. మంచిది అనటానికి లాభం అంటున్నారంటేనే వాణిజ్య సంస్కృతి ఎంతగా వంటబట్టిందో అర్థం అవుతోంది.

పూర్వం మేకప్ అనేవాళ్లు. ఇప్పుడు కంపోజ్ అంటున్నారు.

మనం కూడా ఇలానే చాలా మాటల్ని మార్చేసుకుంటున్నాం. పేపరు చూశావా? అనడుగుతున్నాం గానీ, పేపర్ చదివావా? అనడగటం లేదు. అన్నం తిన్నావా? బోం చేశావా? ఫుడ్ కొట్టావా? మూడూ ఒకే అర్థంలో ఉన్న వేర్వేరు మాటలు. ఫుడ్డునో, మందునో కొట్టడం ఏమిటీ? ఈ కొట్టుడు ఎక్కడిది? జన వ్యవహారంలో స్థిరపడిపోయిన మాటలివి. ఇప్పుడు వ్యాకర్తలు వాటిని చేయగలిగిందేమిటి? నాబోంట్లు కోరేది వాటిని సగౌరవంగా స్వీకరించి, సూత్రీకరించి, భాషాభివృద్ధికి తోడ్పడాలనే!

వ్యాపార లావాదేవీలకు సంబంధించిన దస్త్రాలు, పాలనాపరమైన దస్త్రాలు, వాటి ఉత్తర ప్రత్యుత్తరాలు, వైనిక నివేదికలు, అధికార ప్రకటనలు ఇలాంటివన్నీ సాధికారికంగా ఫార్మల్ భాషలో, సాంప్రదాయబద్ధంగా ఉంటేనే సుబోధకత్వం ఉంటుంది. వీటిని పామర భాషలో వ్రాయటం కష్టం. సాధ్యమైనంత వాడుక భాషలో వ్రాయటం అవసరం. సాంకేతికపదాలు పామరభాషలో ఇమడవు. ఇమడ్చాలని ప్రయత్నిస్తే అవి కూడా గ్రాంథిక వాసనల్ని వదుల్చుకుని పామరంగా మారిపోతాయి. ఫ్లై ఓవర్ పైవంతెనగా మారిపోయినట్టే, సాంకేతిక అవసరాలు జనసామాన్యం నోళ్లలో పడితే తెలుగైజ్ అయిపోతాయంతే!

వాణిజ్య, పాలనా, బోధనా వ్యవహారాలన్నింటికీ సరళ గ్రాంథిక భాషను, తక్కిన దైనందిన వ్యవహారాలకు జనభాష వాడకం, అవసరమైతే చిత్రికపట్టి ఒక క్రమంలోకి తేవటం, కొంత పరిశ్రమ చేసి వ్యాకరణం పరిధిలోకి తీసుకు రావటం జరగాలి. ఏ భాషైనా సరే పండితులు, పామరుల మధ్య రెండుగా చీలిపోవటం ఆరోగ్యదాయకం కాదు కదా!

నిజానికి భాషను బతికించేది పామరులేగాని, పండితులు కాదు. పండితభాష గ్రంథాల్లోనూ, పామరభాష జనం

నాలుకల మీదా బతుకుతుంది. జనంలో బతికేదే అసలు భాష. దానిగురించి పండితులు పట్టించుకోవాలనేదే అభ్యర్థన.

పిండి రుబ్బింగ్ మిషన్ లాంటి మాటలు జనం రూపొందించుకున్నది. దాన్ని మన గ్రాంథిక వ్యాకరణ సూత్రాల రీత్యా దుష్ట సమాసం అంటే చెల్లదు. జనానికి వ్యాకరణంతో పనిలేదు. కానీ, వ్యాకరణానికి జనంతో పనిలేదనటం సరికాదని నేను భావిస్తాను. భాషాభివృద్ధికి వ్యాకరణం ఒక ఉపకరణం కావాలి.

పండితుడు 'టూవీలర్'ని 'ద్విచక్రవాహనం' అంటే, పామరుడు 'రెండు చక్రాల బండి' అంటాడు. గ్రాంథికానికీ, వ్యావహారానికి

అవుననటానికి 'ఎస్' అని స్పష్టంగా పలికేవాళ్లు. ఇప్పుడు "య్యా" అనేస్తున్నారు. 'య్యా' అంటేనే ఇంగ్లీషు బాగా వచ్చినట్టనేది వారి భావన. ఇంగ్లీషు వ్యావహారిక భాషలో వ్యాకరణ సూత్రాలకు అతీతంగా వచ్చిన మార్పులకు ఇదొక ఉదాహరణ మాత్రమే! తెలుగులోనూ ఇది జరుగుతోంది.

ఫార్మల్ భాషలో చైల్డ్'ని, ఇన్'ఫార్మల్ భాషలో కిడ్' అంటారు. పుత్రుడు, కుమారుడు, పిల్లకాయ, బిడ్డడు, కూన ఇన్నిరకాలుగా మనం శ్రోతని బట్టి అనేక పదాలతో పలుకుతున్నాం. కాబట్టి, వ్యావహారానికైనా, గ్రాంథికానికైనా పలికే తీరు మాత్రమే కాదు, వాడే పదజాలంలో కూడా ఎంతో తేడా ఉంది. రైస్ అనే ఇంగ్లీషుమాట జనవ్యవహారంలో తెలుగు మాటగానే వ్యాప్తిలో ఉంది. దీన్ని అచ్చతెనుగులో బువ్వ, కూడు అంటానంటే జనం ఒప్పుకోరు. ఆఖరికి అన్నం అనే మాట కూడా జనవ్యవహారంలోంచి తొలగిపోయింది.

పాలనాభాషగా తెలుగును ప్రవేశపెడితే ఫార్మల్ తెలుగును వాడాలా? ఇన్'ఫార్మల్ తెలుగును వాడాలా? అనేది ఆలోచించాల్సిన ప్రశ్న. వాక్యనిర్మాణంలో కూడా ఈ రెండు భాషల మధ్యా చాలా తేడా ఉంటుంది. పై అధికారి కింది అధికారుల నుద్దేశించి వ్రాసేప్పుడు వాడే భాషకీ, పదజాలానికీ, క్రింది ఉద్యోగి తనపై అధికారిని

ఉద్దేశించి వ్రాసే పదాలకీ చాలా తేడా ఉంటుంది. నిన్ననే మన ఉపరాష్ట్రపతిగారు రాజ్యసభ అధ్యక్షుని హోదాలో 'ఐ బెగ్', 'పార్డన్', 'మిలార్డ్' లాంటి బానిస పదాలను వాడవద్దని సూచించారు. అంటే పాలనాభాషలో కూడా సంస్కరణ అవసరం అన్నమాట.

భాషల ఆకాశంలో ప్రతీపదమూ మెరిసే నక్షత్రమేనని ప్రకటించింది యునెస్కో. కొన్ని పదాలకు నిఘంటు గౌరవం లేదనే ధోరణిని వదిలిపెట్టి భాషను, భాషాపదాలను గౌరవించటం అవసరం. అన్ని తెలుగు పదాలను వాడకంలోకి తేవటమే భాషపట్ల గౌరవం అంటే! వాడుక భాషకు వ్యాకరణ నియమాలు అందుకు తోడ్పడాలి.

హ్యాండ్ బుక్ ఆఫ్ టెక్నికల్ రైటింగ్ అనే పుస్తకంలో జి జె ఆల్'రెడ్, సి టి బ్రూసా వాడుక భాష గురించి వ్రాస్తూ, ఇందులో రచయితకీ, పాఠకుడికీ మధ్య తక్కువ దూరం ఉంటుందనీ, సాంప్రదాయ రచనలో కన్నా ఇందులో పాఠకుడు తాదాత్మ్యత పొందే అవకాశం ఉంటుందనీ అన్నాడు. వాడుక భాష పరమోద్దేశం ఇదే కదా! అది గ్రాంథిక వాసనల్లేని, పూర్తి వాడుక (ఇన్ఫార్మల్) భాష అయినప్పుడు దాని వాక్యనిర్మాణం గురించి వ్యాకరణ శాస్త్రవేత్తలు సూత్రీకరించ గలగాలి

కంప్యూటరీకరణం తరువాత వాడుకభాషలో ఇన్ఫార్మల్ మార్పులు చాలా వచ్చాయి. కట్ అండ్ పేస్ట్ పద్ధతిలో భాష సాగిపోతోంది. 'బ్యాక్ స్పేస్ బటన్' భాషకు అవసరం. వాడుక భాషకు వ్యాకరణ సూత్రాలు ఆ బాధ్యతను నెరవేరుస్తాయి.

పరభాషా పదాలను అవసరం లేక పోయినా మోజుకొద్దీ తెచ్చి బలవంతంగా జన సామాన్యం మీద రుద్దటమే అపచారం.అపకారం, భాషకు అపాయంకూడా! దీన్ని ఖండించటమే కాదు అలాంటి మోజువరులను పట్టి శిక్షించ గలిగే యంత్రాంగం ఉండాలని అంతర్జాతీయ స్థాయిలో అనేకమంది భాషావేత్తలు చాలామంది కోరుతున్నారు . వీళ్ళు భాషా ఛాందస వాదులు ప్యూరిటనిస్టులు లేక గ్రాంధిక వాదులు ఎంత మాత్రమూ కాదు. ప్రజల వాడుకభాష కలుషితం కాకూడదనే భావన ఉన్నవాళ్ళు.

భాషా కాలుష్య పరిస్థితిని నివారించేందుకు భాషా వేగుల వ్యవస్థని వీళ్ళు కోరుతున్నారు. లాంగ్వేజి పోలీసింగ్ గురించి ఇప్పుడు ఇంగ్లీషు ఫ్రెంచి. రష్యన్ మేధావులు తరచూ చర్చిస్తున్నారు. భాషాపోలీసులు లేదా టంగ్ ట్రూప ర్లని ఈ విధుల్ని నిర్వర్తించే వారిని పిలుస్తారు. మనం 'నుడివేగు'లని పిలవొచ్చు.

**మాతృభాష అంటే వాడుక భాషే!**

పుట్టబోయే బిడ్డ అమ్మకడుపులో ఏ భాషలో పెరుగుతాడో ఈ భూమ్మీద పడిన క్షణం నుండీ ఆ భాషలోనే ఎదుగుతాడు. ఇది శాస్త్రీయమైన అంశం

మనిషి తన దైనందిన సామాజిక జీవనానికి మాత్రమే భాష అనేది పూర్తి వాస్తవం కాదు. భాషకు అంతకు మించిన మానసిక ప్రయోజనాలు ఉన్నాయి. అనుక్షణం మనిషి మనసులో మెదిలే ప్రతి ఆలోచనా అతని మాతృభాషలోనే రూపు కట్టుకుంటుంది. భాషా బలం కొద్దీ ఆలోచనలో పరిణతి కనిపిస్తుంది. భాష బలహీనంగా ఉంటే ఆలోచనలూ బలహీనంగానే ఉంటాయి.

ఇంగ్లీషు నేర్చుకుంటే అమెరికాలో ఉద్యోగాలొస్తాయనీ తెలుగు నేర్చుకుంటే ఉద్యోగాలు రావనీ గట్టినమ్మకం విద్యార్థుల్లో కన్నా తల్లిదండ్రుల్లోనే ఎక్కువుంది. భాషని బ్రతుకుతెరువు కోసం వాడుకోవాలనే ఆలోచన విచిత్రమైంది. బ్రతుకుతెరువు కోసం ఎవరు ఏ భాష నేర్చినా ఎవరికీ అభ్యంతరం లేదు. ఇష్టం కొద్దీ ఉత్సాహం కొద్దీ కూడా పరిశోధనాభిలాషకొద్దీ ఎవ్వరైనా ఏ భాషైనా నేర్వవచ్చు కూడా. పరభాషను నేర్వటానికి అమ్మభాషను మరిచిపోవా లనటమే అభ్యంతరకరమైన విషయం.

ఏదైనా ఒక ప్రయోజనాన్ని నెరవేర్చటానికి భాష ఉపయోగపడుతుంది. దాన్ని కమ్యూనికేషన్ (నోటిమాట) అంటారు. అర్థం అయ్యేలా చెప్పటమే నోటిమాటలకు ముఖ్య లక్ష్యం. చెప్పేవాడికీ వినేవాడికీ మధ్య అవతలి వ్యక్తి భాషా పర్జ్ఞానాన్ని బట్టి నోటిమాటలు ఆధారపడి ఉంటాయి. అమ్మ భాష ప్రయోజనం అంతకు మించినది. అది నోటీ మాట కాదు మనసు మాట. మనసు మాట బలంగా ఉంటే నోటిమాటలు కూడా బలంగా ఉంటాయి. Effective communication (శక్తివంతమైన నోటిమాట)అనేది 'మనసుమాట' యొక్క బలం మీద ఆధారపడి ఉంటుంది.

మనం ఏం చెప్పదలచుకున్నామో దాన్ని అమ్మభాషలోనే ఆలోచిస్తుంది మనసు. అది మనసు యొక్క విధి. ఆలోచనను ఏ భాషలో వ్యక్తం చేయదలచుకున్నామో ఆ భాషలో తగిన నుడులు మనకు తెలిసినప్పుడు నోటిమాట మనసు మాటల మధ్య సమన్వయం కుదురుతుంది. వ్యక్తీకరణ బలంగా ఉంటుంది.

మాతృభాష లేకుండా మానసిక వ్యాపారం ఉండదు. మాతృభాష లేకపోతే పరభాషలో మనసు రూపు కట్టుకో గలిగే ఆలోచన కూడా ఏమీ ఉండదు.

పరభాష అవసరార్థం మాత్రమే ఉపయోగపడుతుంది. కానీ మాతృభాష ప్రాణప్రదమైనది. అది లేకపోతే మనిషి మానసికంగా బలహీనుడిగా మిగిలిపోతాడు.

మా పిల్లలకు తెలుగు రాదండీ అని తెలుగు తల్లిదండ్రులు అంటున్నారంటే మా పిల్లలు ఎందుకూ పనికిరానివాళ్లుగా పెరుగుతున్నారండీ అనటమే నని అర్థం చేసుకోవాలి.

సముద్రానికి చెలియలికట్ట లాంటిది వ్యాకరణం. అది భాషని కాపాడుతుంది. ఏ భాషలోనైనా పండితుల ఆలోచనలకు పామరుల ఆలోచనలకూ తేడాలున్నట్టే వాళ్ళ భాషలో కూడా వ్యత్యాసాలు పొటమరిస్తాయి.

వ్యాకరణ నియమాలకు పండిత భాష ఒదిగినంతగా పామరుల భాష ఒదగదు.

మాతృభాష అనేది పామర భాషే గానీ పండిత భాష కాదు. మనసు గ్రాంధికంలో ఏనాడూ ఆలోచించదు. లాక్షణిక వ్యాకరణ సూత్రాలు పామరుల వాడుక భాషను రక్షించలేవు.

మాతృభాష భాషా జాతీయుల సంస్కృతి మీద ఎక్కువ ఆధారపడి ఉంటుంది. భాష అనేది రాయిలా బిగుసుకు కూర్చోదు. ఆ పరిణామశీలతను పెంపు చేయటం గానీ కొద్ది చేయటం గానీ వ్యక్తుల చేతుల్లోని విషయం కాదు. ఈ పరిణామ శీలత లేకపోతే భాష త్వరగా వాడకాన్ని కోల్పోతుంది. పరభాషా పదాలు చేరటం ఒక్కటే భాష కొత్త పరిణామాలకు కారణం అనేది పూర్తి వాస్తవం కాదు. భాషా పరిణామాలకు సాంస్కృతిక కారణాలే ప్రధానమైనవి. సంస్కృతి మనసు ప్రధానమై రూపొందుతుంది.

పాశ్చాత్య దేశాల్లో క్రీ.శ.1640లోనే వాడుకభాషోద్యమం నడవగా అంతకు ఒక శతాబ్దికన్నా ముందే తిక్కనగారి కాలంలో తెలుగులో వాడుక భాషోద్యమం మొదలయ్యింది. రాజభాషకు పామరభాషకూ మధ్య వైరం ఈ నాటిది కాదు. పామరభాష అసలు భాషను కలుషితం చేస్తుందనే వాదనని శుద్ధభాషావాదులు లేదా గ్రాంథికభాషా వాదులు చేస్తున్నారు. వాడుకభాషలో ఆనాడు ప్రైఆకృతం పాళీ సంస్కృతం మధ్యయుగాలలో విదేశీ భాషలు ఆధునిక యుగంలో అమెరికన్ ఆంగ్ల భాషాపదాలు వాడుక భాషలోకి చేరిపోతున్నాయి. సాహిత్య భాషకు వచ్చిన అపకారం ఏమీ లేదు.

క్యాజువల్ సంభాషణలో తక్కువ సమయంలో ఎక్కువ మాట్లాడేలా భాషని వేగంగా పలకటం కనిపిస్తుంది. "నీవు ఏ దిశకు జనుచుంటివి?" అనటం శుద్ధ గ్రాంథికం. "ఎక్కడి దాకా వెడ్తున్నావు?" అని అడగటం సరళ గ్రాంథికం. "ఎందాకా పోతున్నావు?" అనడం శుద్ధ వ్యావహారికం(ఫార్మల్). 'యాడికి బోతన్నవ్?' అనడం జనవ్యావహారికం. ఇదే క్యాజువల్ లేదా ఇన్ఫార్మల్ భాష. ఇక్కడ ఆంగ్లం దూరాలని ప్రయత్నం చేస్తోంది.

జన వ్యవహారిక భాషలో విదేశీ పదాలు చేరినప్పుడు మరింత వేగంగా పలకటానికి అవకాశం ఏర్పడుతుంది. మన వ్యాకరణ నియమాలన్నీ ఈ గ్రాంథిక భాషకే వర్తించేవిగా ఉన్నాయి. సామాన్య మానవుడి భాషకు గుర్తింపు లేకుండా పోతోంది. దాని సంగతిని వ్యాకరణవేత్తలు పట్టించుకోగలిగితే వ్యాకరణం విస్తరిస్తుంది. భాష కూడా విస్తరిస్తుంది.

గ్రాంథికానికి యాస ఉండదు. మాండలికం (డయలెక్టికల్ వేరియషన్) అనేది కేవలం జనభాషలోనే కనిపిస్తుంది. precise unambiguous language లో

సరళత స్వచ్ఛత సంక్షిప్తత వేగం ఉంటాయి. ఇవి జనవాక్కుల్లో బాగా కనిపిస్తాయి. జనభాషలో ధ్వనించేది ఆ వక్త హృదయమే!

**అందరూ పలికే భాషకే అందలం**

"కొఠారీ కమిషన్ వారు మాతృ భాషలోనే ప్రభుత్వం నడపాలి అనే ప్రయత్నం చేయమన్నప్పుడు మన రాష్ట్రం చాలా ముందడుగు వేసింది. కానీ నాకు నచ్చలేదు. మనం చేసిన పని చాలా తక్కువగా అగపడ్డది. ఎందుకు మనం గట్టిగా పని చేయటం లేదా అనుకొన్నాను" అని తొలి అధికారభాష సంఘం అధ్యక్షులు వావిలాల గోపాల కృష్ణయ్య 1974 ఆగష్టు 6న తెలుగు అకాడెమీ 6వ వార్షికోత్సవ సందర్భంగా చేసిన ప్రసంగంలో అన్నారు. (తెలుగు వ్యాస మండలి కృ.జి.ర.సం ప్రచురణ).

తెలుగు అకాడెమీ డిగ్రీ స్థాయి వరకూ ప్రచురించిన పాఠ్య పుస్తకాల్లోని భాష గురించి అసంతృప్తి ప్రకటిస్తూనే కొంత ఆశా భావాన్ని కూడా ఆయన వెలిబుచ్చారు. "ఇప్పుడు మనమెన్నో పుస్తకాలు వేశాం. వాటిలో మనం చెప్పింది ఏమంత ఎక్కువ లేదు. వాటిలోని భాష గురించిన చర్చ వచ్చినప్పుడల్లా ఆ భాష మార్చాలండీ అంటున్నారు. మారుస్తామన్నాం. భాష మార్చక తప్పదు. అవరోధం లేకుండా ముందుకు సాగే గంగా ప్రవంతిలోని రాళ్ళన్నీ గుండ్రంగా అందంగా వుండాలంటే వెంటనే కావు. ఆ ప్రవాహాన్ని కొంత దూరం పోనిస్తే అవే అరిగి అరిగి సురూపంలోకి వస్తాయి." అని! తెలుగు అకాడెమీ తెలుగులో పాఠ్యపుస్తకాలు తెచ్చి నలభైయేళ్ళు దాటిపోవుంది. అవి అరిగి అరిగి తెలుగు వజ్రాలు వస్తాయని వావిలాల వారు పెట్టుకున్న నమ్మకం వమ్ము అయ్యింది. ఒక్కింత కూడా అవి అరగక పోగా జనంలో తెలుగు అంటేనే అయిష్టత ప్రబలింది.

శ్రీ వావిలాల తన ప్రసంగంలో "కోర్టుభాష" గురించి ప్రస్తావిస్తూ "క్రిమినల్ ప్రొసీజరు కోడు కొత్తది వచ్చింది మీకు తెలుసు. అందులో హిందీ వాళ్ళు ఎవ్వరికీ చెప్పకుండా ఓ పెద్ద మార్పు తెచ్చారు. ఇదివరకు కోర్టులలో ఇంగ్లీషు కాక కోర్టుభాష అనుండేది. ఇప్పుడేం చేశారూ? ఇంగ్లీషు అనే మాట ఎత్తేశారు. కోర్టు భాష అన్నారు. అంటే ఎవరికి స్వతంత్రత ఇచ్చారు? ఒక్కక్క రాష్ట్రానికి స్వాతంత్ర్య మిచ్చారు. మరేమైనా ఇంగ్లీషు మాత్రం లేదు. ఇంగ్లీషును ఎప్పుడైతే తీసేశారో ఉత్తర రాష్ట్రాలూ మహారాష్ట్రమూ హిందీ అని రాసేశారు" అని వివరిస్తూ దక్షిణాది రాష్ట్రాల కోర్టులలో మన భాషలను వ్యవహరింప చేసుకోవటానికి మనమే అడ్డంకులు సృష్టించుకున్నామని హిందీవాళ్ళతో సమానంగా "తెలుగు కోర్టుభాష" తెచ్చుకోలేక పోయామనీ అన్నారు.

"మాతృభాషలో సామాన్య జనం మాట్లాడుకొనే పదాలన్నీ పోగు చేసి-కనీసం ట్వంటీయత్ సెంచరీ ఇంగ్లీషు డిక్షనరీ మాదిరి కావాలంటున్నాను. అటువంటిది

ఇవ్వాళ ఉందా? అని అడుగుతున్నాను..." అని ఆవేశంగా ప్రశ్నించారు. నలభైయేళ్ళ తర్వాత ఈరోజున వావిలాల వారు బ్రతికుంటే మళ్ళీ అదే ప్రశ్న అడగవలసి వచ్చినందుకు ఆవేదన చెందేవారు. తెలుగులో పాలన జరగటం లేదని భాషాభిమానులు వావిలాల వారిలాగానే బాధ పడుతున్నారు. కానీ అందుకు కావలసిన పరిభాషను అందించ టానికి మన విశవిద్యాలయాలు గానీ తెలుగు అకాడెమీ గానీ సాంస్కృతిక శాఖ గానీ అధ్యక్షుడు ఉన్నప్పుడు మాత్రమే పనిచేసే అధికార భాషా సంఘం గానీ అరకొరగా తప్ప ఏదీ ఇన్నేళ్ళుగా పరిపూర్ణ కృషి చెయ్యలేదు. భాష లేకుండా న్యాయమూ చట్టమూ ధర్మమూ లేవు. పాటించే వాడి భాషలోనే వాటిని రాయాలనేది అంతర్జాతీయ సూత్రమే!

ఆనాటి అధికార భాషాసంఘం అధ్యక్షునిగా శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారు, హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి, ఇతర న్యాయ మూర్తుల సానుకూల స్పందనలు మళ్ళీ కొత్త ఆశలు కలిగించాయి. కానీ 'తెలుగులో పాలన'కు కావల్సిన పరిభాష సిద్ధంగా లేక పోవటం నిరాశ కలిగిస్తోంది. కనీసం సూపరింటెండెంటును తెలుగులో ఎలా పిలవాలో తెలియని స్థితి. భాష లేకుండా న్యాయమూ చట్టమూ ధర్మమూ లేవు. పాటించే వాడి భాషలోనే వాటిని రాయాలనేది అంతర్జాతీయ సూత్రమే!

1987 మార్చి 24న జస్టిస్ కె కె నరేంద్రన్ కమిటీ మళయాల భాషను కేరళ కోర్టు భాషగా గుర్తించాలని ప్రతిపాదించింది. కేరళ హైకోర్టు పూర్తి ధర్మాసనం దాన్ని ఆమోదించి 1988లోనే ప్రభుత్వ అనుమతి కోసం పంపించారు. ఈ నాటివరకూ ప్రభుత్వ పరంగా ఎలాంటి నిర్ణయమూ రాలేదని 2012 సెప్టెంబరు 27న కేరళ హైకోర్టు ప్రకటించింది (ది హిందూ 29 మే 2006). చెన్నై కలకత్తా హైకోర్టు న్యాయవాదులు మాతృభాష కోసం ఉద్యమించినప్పుడు రాజ్యాంగ నియమాలు అడ్డుగా ఉన్న వైనాన్ని తీర్పుల్లో న్యాయమూర్తులు స్పష్టం చేశారు.(బార్ & బెంచి న్యూస్ నెట్‌వర్క్ జూన్ 24 2010).

యునెస్కో అంతర్జాతీయ మాతృ భాషా దినోత్సవాన్ని ప్రకటించి భాషల రోదసిలో ప్రతి పదమూ ఒక మెరిసే నక్షత్రమేననే నినాదం ఇచ్చిన తరువాత ఈ 13ఏళ్ళలో అంతర్జాతీయ మాతృభాషల పరిరక్షణోద్యమం ఊపందుకొంది. ఒక భాషని దాని పద సంపదని తక్కువ చేస్తే భాషా వివక్షగా పరిగణించాలని మాతృభాషని ప్రాథమికహక్కుగా ప్రకటించాలనీ ప్రతి భాషలో సామాన్యుడి కోసం పరిభాష కావాలనీ గట్టిగా కోరుతున్నారు. సమాచారాన్ని పర్షినాన్ని పరిభాష సూత్రీకరిస్తుంది. తల్లి భాషలో పరిభాష ప్రచారంలో ఉన్నప్పుడు సమాచార నైపుణ్యం పెరుగుతుంది. మానవ సంబంధాలు బలపడతాయి. వ్యవహార నాణ్యత పెరుగుతుంది.

యూరోపియన్ అకాడెమీ మాతృభాషలలో Post Graduation diploma courses in Terminology నడుపుతున్నారు. ట్రెంటో ప్రాంతంలో (ఇటలీ)ఉండే జెర్మనీ మైనారిటీ "మొచెనీ" భాషలో పరిభాష కోసం 2008 నుంచి ప్రతి ఏడాదీ రెండురోజుల పారిభాషిక శిక్షణా శిబిరాలు నిర్వహిస్తున్నారు. సమాచార నైపుణ్యాన్ని పెంచటానికి ఇవి చాలా అవసరం. ఉన్నత విద్యలో తెలుగును తప్పనిసరి చేయనున్నట్లు ప్రభుత్వం ప్రకటించింది కాబట్టి ప్రాచీన సాహిత్య పరిచయంతో పాటుగా ఆధునిక సాంకేతిక ప్రయోజనలకు అవసరమైన "తెలుగు పరిభాష"ని కూడా నేర్పించాలి.

18-1-1795న జె ర్యాంఘామ్ మచిలీపట్నం జిల్లా కలెక్టరుగా వచ్చాడు. ఆయన వస్తూనే ప్రజలు తమ కష్టసుఖాలు చెప్పుకో వటానికి భాష ఒక అవరోధంగా ఉండటాన్ని గుర్తించాడు. "ప్రజలు తప్పనిసరిగా తమ ఫిర్యాదులను కేవలం తెలుగు లోనే వ్రాయాలి. ఇంగ్లీషులో ఇచ్చినవి పరిశీలించబడవు. ప్రజలు తమ కష్టసుఖాలను తమకు వచ్చిన భాషలో తమంత తామే ప్రభుత్వానికి చెప్పుకోవాలి..." అని ఒక ఆదేశాన్ని జారీ చేశాడు. 1-8-1795న వీరన్న అనే పౌరుడు ఆంగ్లంలో పిటీషన్ ఇచ్చిన కారణంగా అతని ఫిర్యాదు తిరస్కరించాడు కూడా(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్కయివ్స్ మచిలీపట్టణం రికార్డ్సు). మన పాలకుల్లో 'మిష్టర్ ర్యాంఘాం' లు కావాలి.

కేంద్ర ప్రభుత్వ కార్యాలయాల్లో హిందీ ఆపీసర్ల పద్ధతిలోనే రాష్ట్ర ప్రభుత్వ కార్యాలయాల్లో తెలుగు భాష ఆఫీసర్లను నియమించాలి. అనేక భాషలు మాట్లాడే ప్రజలున్న చాలా దేశాలలో పరిభాషా సంఘాలు(Terminology Commission) పని చేస్తున్నాయి. పౌర పాలన న్యాయపాలనా రంగాలను స్థానిక భాషలో నిర్వహించటం ప్రజల ప్రాథమిక హక్కుగా భావిస్తున్న దేశాలున్నాయి. నిర్ణయాధికారంగల "సాధికారిక తెలుగు పరిభాషా సంఘం (టెర్మినాలజీ అథారిటీ)" ఏర్పడాలి. ఆక్స్‌ఫర్డ్ నిఘంటువును ప్రతి ఏడూ పెంపుచేస్తూ కొత్తపదాలు సూచించాలని ప్రపంచ ప్రజలను కోరినట్టే ఇంగ్లీషు పరిభాషకు సమాన మైన తెలుగు పదాలను సూచించటానికి తెలుగు ప్రజలకు అవకాశం ఇవ్వాలి. తెలుగు ఇంగ్లీషు మహా నిఘంటువు (లెక్సికాన్) తయారులో ప్రజలను భాగ స్వామయం చేయకుండా కేవలం ఒకరిద్దరు పండితులకు అప్పగిస్తే జనంలోని పదాలు నిఘంటువులకు ఎలా ఎక్కుతాయి? జనం మాట్లాడుకునే ప్రతీ తెలుగు పదం దాని ఇంగ్లీషు అనువాదం ఎప్పటికప్పుడు ఇంటర్నెట్‌కు అందించి చర్చకు పెట్టాలి. వావిలాలవారన్నట్టు అప్పుడు పదాలు అరిగి అరిగి తెలుగు వజ్రాలు బయటపడతాయి.

# తెలుగులో అతిథిపదాలు

అంకారించు (పోర్చుగీసు, తెరచాప ఎత్తేయటం)
అంజీర/అంజూరా(పారసీ) : అంజూరా పండు
అంబారీ (పారసీ) : ఏనుగు పైన కూర్చోవటానికి చేసే అలంకారం
అగతమ్మ(పోర్చుగీసు), చెన్నై పరిసరాలలో ఒక కులదేవత
అగస్తు : (పోర్చుగీసు, ఆగష్టు నెల)
అజమాయిషీ(అరబ్బీ) : పర్యవేక్షణ
అత్తరు(అరబ్బీ: అత్ర్) :
అదపు/అదుపు (అరబ్బీ) : అదాబ్: సాహిత్యం, క్రమశిక్షణ
అదలు(అరబ్బీ) : బదలాయింపు
అదల్(అరబ్బీ) : అడలు, న్యాయం, ధర్మం
అదాలత్ (అరబ్బీ) : కోర్టు
అదావతు (అరబ్బీ) : వైరం
అపరంజి : పారసి: అఫ్రంజ్ ఈజిప్ట్ దేశంలోని వర్తక కేంద్రం, పుటము పెట్టిన బంగారము,
అపొస్తలు (పోర్చుగీసు, అపోస్తలుడు-క్రీస్తు ముఖ్య శిష్యుడు)
అమలు(అరబ్బీ) : జరిగేలా చూడటం
అమల్దార్: (పారసీ : కలెక్టర్ స్థాయి అధికారి
అమానత్తు(పారసీ) : భద్రంగా ఉంచమని నమ్మకంగా ఇచ్చేది
అమారు(పోర్చుగీసు)-ఓడ లంగరు మోకు
అమీనా (అరబ్బీ) : రెవెన్యూ అధికారి
అమీలా (అరబ్బీ) : రెవెన్యూ అధికారి
అయివేజు(పారసీ) : ఆదాయం, డబ్బు
అరుగోలా(పోర్చుగీసు) - పెద్ద ఇనుప కడియం లేదా రంధ్రం, పడవ నడిపే తెడ్డుని ఉంచే కడియం.
అర్క : సంస్కృతంలో ఆవిరిని పట్టి చల్లార్చి తీసిన జలం, అరబ్బీలోజ్యూస్, రసం
అర్జీ (అరబ్బీ): పిటీషన్
అల్మారా (పోర్చుగీసు: అల్మారీ)-బీరువా, అలమారు, అరమర, అరమార, సామగ్రిని దాచటానికి గోడ బీరువా, అల్మార,

అల్లా: (అరబ్బీ) భగవంతుడు

అసలు: (అరబ్బీ) హసలు: మూలము, మొదలు, సహజము అనే అర్ధంలో వాడకం, మరాఠీ అసల్, పారసీ అస్‘ల్

అసివారు : వాహ్యాళి, మరాఠీ అసివార = రౌతు, అశ్వారోహకుడు

అక్రోటు (పారసీ): అక్రోటుకాయ

ఆదమరచు: పారసి: యాద్ పదానికి తెలుగు మరపు కలిపిన ప్రయోగం ఇది.

అన (పోర్చుగీసు) : దస్తావేజుల్లోనూ శాసనాల్లోనూ శకారంభం అనే సూచనకోసం తరచూ ఉపయోగించేవారు.

అనాస(పోర్చుగీస్) : అనాస పనస పండు, పైన్‘యాపిల్

అరబీ : అరబ్బీ భాష

ఆరిమాని (పోర్చుగీసు) : హార్మోనియం పెట్టె

ఆర్మదా: (పోర్చుగీసు) నౌకాదళం

ఆర్యా: (పోర్చుగీసు- ఆర్యా చేయటం అంటే ఓడ తెరచాపలు దించటం

ఆల్పి: (పోర్చుగీసు-)గుండుసూది, అలపనాతి అని కూడా అంటారు

ఆసామి(అరబ్బీ) యజమాని : ఆసోమ్ (అస్సామ్)కి చెందిన భూస్వామి అనే అర్థాన్ని కూడా చెప్తారు.

ఇనాము : ఈనాము చేసిన సేవలకు మెచ్చి ఇచ్చిన బహుమతి, పారసీ, అరబ్బీ: ఇన్‘ఆమ్

ఇనామ్ దార్: (పారసీ) ఇనాముకు హక్కుదారుడు

ఇన్కార్(అరబ్బీ) : తిరస్కరణ

ఇస్తిహారు(అరబ్బీ) : ప్రకటన

ఇస్తీహార్ (అరబ్బీ) : చట్టబద్ధంగా ప్రకటించటం

ఇస్త్రీ (పోర్చుగీసు- ఎస్తీరార్) ఇస్త్రిరి, బట్టల్ని నిప్పులపెట్టెతో నునుపు చేయటం

ఈనాము (చేసిన సేవలకు మెచ్చి ఇచ్చిన బహుమతి)

ఉజూరు(అరబ్బీ) : గౌరవం

ఏసోబు: (పోర్చుగీసు) హిస్సోపు

ఒలంద: వలంద: హాలెండు, ఒలందులు = డచ్చివారు

ఓకు(పోర్చుగీసు) : ఓకులష్) టెలిస్కోపు, ఓకువేసి చూడు అనేది ప్రయోగం

కంఖాణి (అరబ్బీ) (ఆఫ్ఘనిస్థాన్ మేలిమి గుర్రం)

కంత్రాటు(పోర్చుగీసు : కంత్రాతు) పని చేయటానికి ఒడంబడిక, కాంట్రాక్ట్
కందకం (అరబ్బీ) : పెద్ద గొయ్యి
కందీలు(పోర్చుగీసు: కందీల్) : నూనె దీపం, ప్రమిద, డచ్చి కందెలార్ = కొవ్వొత్తి,
కతాబీ: పత్రాల మీద వ్రాసుకున్న ఒప్పందం
కత్తలాని(ణి) ఖత్తులాణము: ఖత్లాన్ దేశపు గుర్రము, కవచం తొడిగిన గుర్రము
కపాతు: (పోర్చుగీసు) బీర్జాలు తీసేసిన కోడె,
కపాయీ: (అరబ్బీ) పొడవైన గౌను వంటి వస్త్రం
కప్తాను: కపితాను, ఓడ కెప్టెన్-captain, పోర్చుగీసుల రాకకు ముందే ఈ పదం తెలుగులో వ్యాప్తిలో ఉందని దొణప్పగారు
కప్పలి : (సరకు రవాణా చేసే ఓడ, మలయాళ పదం కావచ్చు
కప్పు : పోర్చుగీసు కాపావపాదిరి(ఫాదర్) కట్టుకునే అంగవస్త్రం, పచ్చడం స్పానిష్ కప్పువదుప్పటి,
కబరు (అరబ్బీ) : వార్త
కబాయి: అరబ్బీ-కబ్బా, చేతులు లేని పొట్టి కోటు, నెహ్రూ జాకెట్, అంగీ,
కమరు: ఒడ్డాణము, మరాఠీ కమర, కంబర
కమాను(పోర్చుగీసు)ప్రయాణం కమీన్యార్ = పయనించు, ఫ్రెంచి కామాదండయాత్ర
కమాను: (పారసీ) విల్లు, వయొలిన్ వంటీ తంత్రీవాయిద్యాలను వాయించటానికి ఉపయోగించే ఒక సాధనం
కమిస్సెరీ దొరలు: (పోర్చుగీసు) సైనికోద్యోగులు
కమీజు(పోర్చుగీసు: కమీజా) : కప్పా, కవిసె, లోపల తొడుక్కునే చొక్కా, బనీను లాంటిది.
కమేలా/గమేళా : (పోర్చుగీసు) ఒక పెద్ద పాత్ర, గుండిగ కన్నా చిన్నది
కరారు/ఖరారు : ఒప్పందం కుదరటం
కరారునామా (పారసీ) : ఒప్పందం
కర్తాజ్ : అనుమతి పత్రం, స్పానిష్ కర్తూచో, (ఫ్రెంచి కర్తూష్, అరబీ కిర్తాస్), తెలుగు కాకితము, కాగితం, కాయితం
కర్మాయి: (పోర్చుగీసు) కుంకుమ రంగు, కర్మిన్ = రక్తవర్ణం
కలము,(అరబ్బీ) పెన్ను, గంటము
కలీఫా (అరబ్బీ: రాజు బిరుదునామం
కళాయి(పారసీ): లోహ పాత్రలలోపల వైపు మెత్తిన తగరం పూత
కళాయి(హిందీ): నీలిమందు వగైరాలను కాచే పెద్ద కాగు

కళాసీ(పారసీ): ఓడరేవుల్లో పనిచేసే కార్మికుడు
కవాతు(అరబ్బీ): రూలు పాటించటం
కసూది(పారసీ) : ఎంబ్రాయిడరీ చేసే పెద్ద సూది
కస్కస్(పారసీ): గసగసాలు
కస్తీ/కస్తు: తీవ్రమైన విచారం
కాకితము (లేఖ, పత్రము)
కాకితము:(పోర్చుగీసు కాతరస్వముతక పేపరు, స్పానిష్ కర్తాచో, ఫ్రెంచి కర్తూష్, అరబీ కిర్తాస్, తె: కాకితము, కాయితం
కాకీ/ఖాకీ (పారసీ): ముదురు గోధుమవర్ణం
కాజా: గుండీలు పెట్టుకోవటానికి బెజ్జం.స్పానిష్ 'కాహా' లోంచి పోర్చుగీసుల ద్వారా మనకు చేరిన పదము
కాతోలికు(పోర్చుగీసు) పోపు అనుయాయి క్రైస్తవుల శాఖ
కానా : (పోర్చుగీసు) ఖాళీ స్థలం, తూము లాంటిది, కాను, ఓడ గట్టున చేరిన నీళ్ళు బయటకు పోయేందుకు కట్టిన తూము
కానూన్(అరబ్బీ) : చట్టం
కాఫీ (పోర్చుగీసు)
కాఫ్వా(అరబ్బీ) : కాఫీ
కాయం/ఖాయం(అరబ్బీ): శాశ్వతం, తప్పకుండా అనటం
కాయిలా(పారసీ): జబ్బు పడటం, కుంటుపడటం
కారకూన(పారసీ): కర్మాగారంలో పనిచేసే కార్మికుడు
కారస్థాన(పారసీ): తెలివైనవాడు, మేథావి
కారా(పారసీ): పని
కార్ఖాన(పారసీ): కర్మాగారం
కిచ్చడి(మరాఠీ: ఖిచిడీ, అనేక కూరలు వేసి వండిన వంటకం
కినార్(అరబ్బీ): తీరము
కిఫాయత్ (అరబ్బీ): లాభం
కిమ్మతు(అరబ్బీ): వెల, ధర
కిరస్తానము :(పోర్చుగీసు) క్రైస్తవ జన సమాజం
కిరస్తానీ: క్రిస్టియన్ (పోర్చుగీస్: క్రిస్తాన్)
కిరాయి(పారసీ): చేసిన శ్రమకు చెల్లించే బాడుగ

కిస్తు(అరబ్బీ): వాయిదా, విడత, కిస్తుబందీ
కుందనము(మరా) కుందన, మేలిమి బంగారు,
కుంపస్: (పోర్చుగీసు) దిక్సూచీ, కుంపస్సు, ఇంగ్లీషులోకి కంపాస్'గా చేరింది.
కుంపాస్/కంపాస్ : దిక్సూచి, (పోర్చుగీసు : కుంపస్సు)
కుంఫిటీ/కుంపిణీ, కుంభినీ...పాశ్చాత్య వర్తక సంఘం, (పోర్చుగీసు:కుంపన్హి)
కుదీలు/కుదేలు : కొదీలి: (పోర్చుగీసు కొదీల్యు) పేకాట పరిభాష.
కుమ్మక్కు(పారసీ) : సాయపడటం
కురాన్: (అరబ్బీ) మహమ్మదీయ మతగ్రంథం
కుర్చీ(అరబ్బీ): కుర్చీ
కుర్తా(పారసీ): పొడవైన చొక్కా
కుర్నీస్(పారసీ): వంగి సలాములు చేయటం
కులాసా/ఖులాసా(అరబ్బీ): ఆరోగ్యంగా ఉండటం
కుల్లా: కుల్లాయి, పటరచిత మకుటము–కులాహ్ = సాధువులు ధరించే నల్లమేక తోలు టోపీ, శీర్షాఛ్ఛాదనం
కుస్తీ (పారసీ): మల్లయుద్ధం
కూచి(పారసీ): సైనికవిన్యాసం
కూజా(పారసీ): ప్రత్యేకమైన ఆకారం కలిగిన మట్టికుండ
కూలీ (పారసీ) : సేవకుడు, రోజువారీ వేతన జీవి
కూసాలు(పారసీ): ఎక్కువ సంతోషం, కుసీ, ఖుషీ
కైదు/ఖైదు(పారసీ) బంధించటం
కైఫీయత్ (అరబ్బీ): గ్రామచరిత్ర
కొజ్జా: మరాఠీ: ఖొజా = ఖ్వాజా = ఫకీరు, పారసి : ఖ్వాజా = ధర్మదేశికుడు, ఖ్వాజసరా = నపుంసకుడు, రాణివాసపు కావలివాడు,
కొత్వాల్: (అరబ్బీ) పోలీసు అధికారి
కొసరు(అరబ్బీ): అల్పం, కొద్దిగా
కోపా : (పోర్చుగీసు : కోపు) చర్చిలలో వాడే గిన్నె,పెద్దగళాసు. పంచపాత్ర లాంటిది.
కోస్తా : సముద్ర తీరప్రాంతం (పోర్చుగీసు కొస్తా) కోహళి(కుల్లా)
కోహళి (కుల్లా)
కౌలు (అరబ్బీ) : ఒప్పందం
క్విజిని : కుశిని=వంటిల్లు, పోర్చుగీసు కుజిన్యా, ఇంగ్లీషు క్విజైన్

ఖజాంచి : (అరబ్బీ) కోశాధికారి

ఖజానా (అరబ్బీ) : కోశం

ఖట్టు : ఉత్తరం

ఖరాబు: (అరబ్బీ) చెడిపోవటం :

ఖరీద్(పారసీ) : వెలకలిగిన

ఖర్చు : (పారసీ) : వ్యయం వెచ్చించటం

ఖర్చు: వ్యయము, మరాఠీ ఖర్చ, పారసీ: ఖర్చ్

ఖర్చుదార్: వ్యయం భరించేవాడు

ఖర్బూజా(అరబ్బీ): కర్బూజా లేదా తరుబూజ పండు

ఖాజీ: (అరబ్బీ: కాజీ) న్యాయమూర్తి

ఖానా(పఠాన్ల బిరుదు నామం): ఖాన్

ఖానా(పారసీ): ఇల్లు

ఖానాసాహెబా (పారసీ): అత్యున్నత అధికారి

ఖాయం(పారసీ): అనుకూలంగా తప్పనిసరిగా

ఖాలీ/ఖాళీ(అరబ్బీ) : శూన్యం

ఖిల్లా (అరబ్బీ) : కోట

ఖిల్లేదార్: (అరబ్బీ)కోటకు అధికారి

ఖుదా: (పారసీ) మహమదీయుల దేవుడు

ఖుద్దు(పారసీ): స్వంతం

ఖురాకు(పారసీ): చిక్కిపోతున్నవారికి పెట్టే పోషక విలువలు కలిగిన ఆహారం

ఖుసి( పారసీ: ఖుషీ), విలాసం

ఖూనీ: (పారసీ) హత్య

ఖూబు(పారసీ): సుందరమైన

గంజాయి (మరాఠీ: గాంజా) మాదకద్రవ్యం

గజము(పారసీ): యార్డ్, ఒక కొలత

గమేళా: కమేళా, ఇనుప గంప (పోర్చుగీసు గమేలా)

గరమ్ మసాలా: (పారసీ): ఘాటైన సుగంధ ద్రవ్యయుక్తం, హాట్ స్పైసెస్

గరీబా(అరబ్బీ): పేదవాడు, గరీబు

గలబ(మరాఠీ: గలబలణే), అల్లరి, గలభా

గలాటా(పారసీ): అదుపు తప్పిన పరిస్థితి

గలీజు(అరబ్బీ): చెత్త
గల్లా(పారసీ) :  దుకాణంలో యజమాని డబ్బు ఉంచే పెట్టె
గసగస: గసగసాల విత్తులు, పారసి: ఖష్‌ఖాష్
గస్తు/గస్తీ-దొంగలు పడకుండా కావలి తిరగటం, మరాఠీ గస్త = కావలి
గాగరా: ఆడవాళ్ళు కట్టుకునే పావడా (మరాఠీ ఘాగ్రా)
గాయి(పారసీ) : ఆవు
గార(పారసీ): ప్లాస్టర్, పొర
గిరఫ్తారీ(పారసీ): కష్టాల్లో చిక్కుకోవటం
గుమాస్తాగిరీ(పారసీ): గుమాస్తా ఉద్యోగం
గుమ్మటం (పారసీ): ఉల్లిపాయ ఆకారంలో ఉండే డోమ్
గులాబీ (పారసీ): రోజాపువ్వు
గులాము(అరబ్బీ): బానిస
గులాము: (పారసీ) గులాబీ రంగు పొడి
గుల్లాము, గులాము-ఉంపుడుకత్తె, నీచురాలు, పారసీ: గులామ్ :
గైరాజరు/గైర్‌హాజర్ (అరబ్బీ): వ్యక్తిగతంగా అక్కడ ఉండటం
గొంగడి(మరాఠీ: ఘోంగ) కంబళి, దుప్పటి,
గోదాము: గిడ్డంగి(పోర్చుగీసు: గుండరు)కొట్టుగది, సరుకులుంచి అమ్మే కొట్టు, గడంగు, గుదాం
గోరీ: (పారసీ) సమాధి
గోవ: (మరాఠీ-గోవే)ఈ నాటి గోవా రాష్ట్రం, గోవ జవ్వాది (గోవా ఓడరేవు నుండి దిగుమతి అయిన జవ్వాది)
గోవజవ్వాది (మరాఠీ) గోవా రేవునుండి దిగుమతి అయిన సుగంధ ద్రవ్యం
గోహరి: పారసీ గోహర్ = పరాక్రమము
చక్బందీ(పారసీ): హద్దులు నిర్ణయించటం
చపాతీ(పారసీ): నాలుగు పొరలమీద వత్తిన గోధుమరొట్టె
చప్రాసీ: (అరబ్బీ, పారసీ) ప్యూన్
చబుకు/త్సబుకు(పారసీ) : విప్, విధిగా చేసితీరాలనే ఆదేశం
చబుకు: కొరడా (మరాఠీ: చాబూక)
చలాకీ(అరబ్బీ): చురుకుగా ఉండటం

చవక: చవుక, చౌక:  లోకువ తక్కువ చేయటం (మరాఠీ: సంవగ)
చవరీ: సవరం(మరాఠీ)
చాకిరి: (అరబ్బీ) సేవ
చాడి (మరాఠీ: చహాడీ, చాడీ) కొండెములు చెప్పటం
చాదరా(అరబ్బీ): పక్కబట్ట, దుప్పటి
చామలా(కడియాలలో ఒక రకం )
చావడి(మరాఠీ : చావడీ), కొలువు కూటము
చికిలి: తుడిచి శుభ్రం చేయటం, మెరుగుపెట్టటం, మరాఠి సికల = మెరుగు
చిట్నావీస్(పారసీ) : అధికార పత్రాలు  వ్రాసే అధికారి
చిమట : మరాఠీ (క్షురకుని చిమటా)
చిలిమి(పారసీ) : హుక్కాలోపల ఉండే గిన్నె లాంటి భాగం
చుక్కాని(అరబ్బీ) :  తెడ్డు
చునా : సున్నం(మరాఠీ)
చెవి: బీగం, తాళపు చెవి, (పోర్చుగీసు షావీ)
చోజ: చోద్యం (మరాఠీ)
చోపుదార్/సోపుదార్(పారసీ): చేతిలో దండం ఉన్న అధికారి
చౌకీ(అరబ్బీ): ఇంటిలోపలి భాగం
చౌకీదార్: (అరబ్బీ): కాపలాదారుడు, వాచ్'మాన్
జప్తు: (అరబ్బీ): ప్రభుత్వం స్వాధీనం చేసుకోవటం
జబర్జంగ్: అరబ్బీ జఫర్ = విజయం, పారసీ జంగ్ = పాలకుడు, ఈ రెండు మాటల్నీ కలిపి జబర్జంగ్ = విజేత అయిన ప్రభువు
జబర్దస్త్(పారసీ) : పైచేయి అనే అర్థంలో పారసీ పదం, బలవంతంగా, వత్తిడి పెట్టు, జులుం ప్రయోగించేది జబర్దస్తీ (వినోద కార్యక్రమం కాదు)
జబ్బు: ఒంట్లో బాగోక పోవటం, మరాఠీ : జబూన
జమా (అరబ్బీ):    ఆదాయం
జమాఖర్చు(పారసీ): ఆదాయవ్యయాలు
జమాదార్:(అరబ్బీ, పారసీ) సిపాయీల పైన అధికారి
జమాబందీ/జమాపందీ: రెవెన్యూ శాఖ నిర్వహించే భూముల నిర్ధారణ
జమావసూలు-బాకీ (పారసీ): పన్ను కట్టని మొత్తం

జమీందార్: (అరబ్బీ) భూమికి అధిపతి
జమీను: (పారసీ) భూమి
జమ్ముఖాణము(రంగు రంగుల నూలు పట్టెలు కల ఆస్తరణము–carpet)
జరతారు/జలతారు(పారసీ): బంగారపు పోగులతో అల్లిన ఎంబ్రాయిడరీ
జరీ: వెండి బంగారముల మొలాము, జలతారుపారసి: జర్, జరీన్ = బంగారం,
జరీబు(పారసీ): భూమి కొలత
జరూరు(అరబ్బీ, పారసీ): వెనువెంటనే
జలపోసనము: బంగారపు పూత, గిల్టునగల పైన పూత, పారసి: జర్'పోష్
జల్దీ(పారసీ) : వేగంగా
జవక: జంట(మరాఠీ)
జవాన్: (అరబ్బీ): యవ్వనవంతుడు, జమాను, ప్యూన్,
జవాబు (అరబ్బీ): సమాధానం
జవాబుదారీ(అరబ్బీ): బాధ్యత కలిగి ఉండటం
జహాపనా: (అరబ్బీ) ప్రభువు
జాఇ: మరాఠీ (జాజి)
జాగా(పారసీ) : ఖాళీ స్థలం
జాగీరు(పారసీ) ఎస్టేట్
జాదూ(పారసీ): మాయగాడు
జాదూగిరీ(పారసీ): మాయల విద్య
జానువార్(పారసీ): జంతుజాలం
జాబితా(అరబ్బీ): పట్టిక
జామీను(పారసీ): బెయిలు, హాజరీజామీను
జారీ(అరబ్బీ): విడుదల చేయటం
జాళువా: మేలిమి బంగారం, మధ్య యుగాలలో తెలుగులోకి ప్రవేశించింది.
జాస్తి: (పారసీ): ఎక్కువ, మిక్కిలి
జిమ్మ(అరబ్బీ): అధికారం, విధేయత
జిరా: అంబారీ కోసం ఏనుగు లేదా గుర్రం మీద వేసే వస్త్రం, పారసి: జర, జిరహ్ = కవచం
జిలేబీ(పారసీ): చుట్టలుగా ఉండే తీపిపదార్థం

జిల్లా: (అరబ్బీ) ఒక ప్రాంతం
జీను (పారసీ): గుర్రంపైన కూచోనేప్పుడు వేసుకునేది
జీరా(పారసీ) : జీలకర్ర
జుమ్మా మసీదు (అరబ్బీ) అశ్వకుడు, గుర్రాన్ని తోలేవాడు
జుమ్మా మసీదు (పారసీ):శుక్రవారం మసీదు
జుర్మానా(అరబ్బీ): జుల్మానా, శిక్ష, ఫైన్ వేయటం
జులాబు(పారసీ): విరేచనాల మాత్ర
జులుము: (మరాఠీ జులూమ) దుండగం
జూటరి(మరాఠీ: ఝుట్) అబద్ధాలాడేవాడు, మోసగాడు
జూదం: మరాఠీ (జూం)
జూదరి: మరాఠీ (జువార)
జెంటూ: జెంతూ, తెలుగువాడు. జెంతియ = క్రైస్తవేతరుడు, అవిశ్వాసి, బ్రౌన్ తెలుగు వారని అన్నాడు.
జేబు: జీబు(మరాఠీ: జేబ్) జేబు, 22/7 గణితశాస్త్రంలో 'పై ' విలువ. దీన్ని $\pi$ గుర్తు వ్రాస్తారు.ఆర్యభట దీని విలువను తొలుత కనుగొన్న వ్యక్తి. ఆయన దీన్ని 'జ్యా' అన్నాడు. అరబ్బీయులు ఈ జ్యాపదాన్ని జీబ్ అని అనువదించి ఈ $\pi$ గుర్తును ఏర్పరచుకున్నారు. ఈ జీబ్ ఆకారంలో చొక్కాలకు జేబులు కుడతారు. అలా జీబు అనేమాట జేబు అయ్యింది.
జోగు(పెద్ద తెరచాపలు 12 గలిగిన ఓడ)
జోడు: మరాఠీ (జోడీ)
జోరు(అరబ్బీ): ఉత్సాహవంతం
టక్కా/తక్కా(పారసీ): మోసం, దక్కాముక్కలు తిన్నాను అంటే ఇలాంటి మోసాలెన్నో చూశాను అనటం
ఠాంగు(పారసీ): బిగువుగా
ఠాణా (పారసీ): పోలీస్ స్టేషన్
డఫేదార్(అరబ్బీ): పోలీసు అధికారి
డమామి: మరాఠీ ధమామి, ఢంకా కన్నా చిన్న వాయిద్యం
డేరా: (మరాఠీ: డేరా) గుడారము
తంబాకు(పారసీ): పొగాకు
తంబూరా(పారసీ) తంబూరీ, వాయిద్య విశేషం

తకరార్  (అరబ్బీ): కష్టం
తక్‌సీరు (అరబ్బీ): నేరం
తగాదా (పారసీ): వైరం, పోట్లాట
తనఖా (అరబ్బీ): తనకా, కుదువపెట్టడం,
తనిఖీ  (అరబ్బీ): పరిశోధించు, పరిశీలించు
తపేలా  : (పోర్చుగీసు) ఒక గిన్నె వంటి పాత్ర
తబల: ఒకే కన్ను కలిగిని చర్మవాయిద్యాల జంట, మరాఠీ: తబలా, అరబ్బీ పారసి: తబ్‘లా.
తమషా(అరబ్బీ): సరదా
తయ్యార్(పారసీ): తయారవటం, రెడీగా, సిద్ధంగా ఉండటం
తరఫు(పారసీ): ఒక పక్షం వహించటం
తరుణాసీరి(బర్మాలో తన్నాసిరి నదీ తీరంలో తన్నాసిరి పట్టణం నుండి దిగుమతి అయిన వస్తువు
తర్జుమా (అరబ్బీ): అనువాదం చేయు
తవాయి(బర్మాలో తవాయి నదీ తీరంలో తవాయి అనే పట్టణం నుండి దిగుమతి అయిన వస్తువు)
తస్తు(పారసీ): నీళ్లకుంద
తస్వీర్/తసబీర్ (అరబ్బీ): పెయింటింగ్,
తహసీలు: జిల్లాలో ఒక ప్రాంతం
తహసీల్దార్: (అరబ్బీ) తహసీలుకు అధికారి
తాకట్టు(పారసీ): కుదువబెట్టడం
తాజా కలము(పారసీ): ఉత్తరం చివర అదనంగా వ్రాసే అంశం (పి. ఎస్ = పోస్ట్ స్క్రిప్ట్)
తాజా(అరబ్బీ): నవ్యమైన
తాపిత(పారసీ): మెరిసే మెత్తని పట్టుబట్ట
తాబే(అరబ్బీ): ఆధారపడ్డవాడు
తాబేదార్: (అరబ్బీ) అనుచరుడు
తాయెతు: తాయిత్తు, తావీజు, రక్షాభూషణం, మరాఠీ: తావీజు, అరబ్బీ: అవీజ్,
తారు(పారసీ) : నల్లని

తారీఖు  (అరబ్బీ) : తేదీ,

తుపాకీ : (అరబ్బీ) : మారణాయుధం

తుపాన్(అరబ్బీ): తుపాను

తురక: తుర్కీ జాతీయుడు, ఇస్లాము మతానుయాయి, (మరాఠీ తుర్క), తుర్కీ: మేలుజాతి గుర్రం

తురుపు(పోర్చుగీసు: త్రూప్) గుర్రపుదండు

తువాల(పారసీ: తౌలీయ), తుండుగుడ్డ, (పోర్చుగీసు: తోవాల, ఇంగ్లీషు టవల్)

తేజీ: అరబ్బు దేశపు మేలుజాతి గుర్రం (మరాఠీ తేజీ)

తైనాతి(అరబ్బీ): నమ్మకస్తుడికి బాధ్యత అప్పగించటం

తోప(పారసీ): ఫిరంగి

త్రాసు(పారసీ):  తరాజు, తాసు, తుల, తక్కెడ. మరాఠీ = తరాజు,

దగలు/తగలు(పారసీ): మోసం

దగల్–బాజీ/దగుల్బాజీ/(పారసీ):  మోసగాడు

దగాకోరు(పారసీ):  నిజాయితీ లేనివాడు, మోసగాడు

దఫా: (అరబ్బీ): విడత, వంతు

దఫ్తర్(పారసీ):   రిజిష్టర్

దఫ్తర్'దార్: రెవెన్యూ హెడ్ గుమాస్తా

దబీర్(పారసీ): రచయిత, మున్షీ

దమ్ము(అరబ్బీ): ఊపిరి

దరగా/దర్గా(పారసీ):  మహనీయుల దివ్యక్షేత్రం

దరదు(పారసీ): దర్ద్, నొప్పి

దరిబేసి: ముస్లిం ఫకీరు మరాఠీ  దరవేసీవదేశ సంచారి, దర్వేషు–నిర్ధనుడు, దర్వేషీవసాధు జీవితం

దరిమ్–ఇలా (పారసీ): అయిన తరువాత, దరిమిలా

దరోగా(పారసీ) :   మేస్త్రీ, పనివారిపైన అధికారి

దరోగా: (అరబ్బీ)  స్థానిక ముఖ్య అధికారి

దర్జా(అరబ్బీ): హోదా

దర్జీ(పారసీ):  బట్టలు కుట్టు నిపుణుడు, టైలర్

దర్బార్ (పారసీ): రాజ్యసభ

దర్యాప్తు/దరియాప్త్: నేర పరిశీలన
దర్వాజా(పారసీ): ద్వారం
దలాలీ (పారసీ): బ్రోకర్
దవా: (అరబ్బీ) ఔషధం
దస్కతు (హిందీ): సంతకం
దస్తా(పారసీ): కాగితాల కట్ట, 25 షీట్లు
దస్తావేజు (పారసీ): డాక్యుమెంట్
దస్తూరి(పారసీ): చేతివ్రాత, ఆచారం
దాఖలా: (అరబ్బీ): నిరూపణ, సాక్ష్యం, ఉపపత్తి
దాఖలు: (అరబ్బీ): చేర్చు, ఉంచు
దాదాగిరీ(పారసీ): దుష్టుడు, విలన్
దాయీ (పారసీ): నర్సు, దాదీ
దావత్ (పారసీ): ఇంకు బాటిల్
దావా: (అరబ్బీ): న్యాయస్థానంలో సూట్ వెయ్యటం
దావాదార్ (పారసీ): ప్రాసిక్యూటర్
దినమార్గ/దినమార్కు: డెన్'మార్కు
దినవహి రోజువారీ లెక్కలు వ్రాసే ఉద్యోగి
దిమాకు/దిమాగ్(అరబ్బీ): మెదడు, మనసు
దివాన్: (అరబ్బీ) ప్రధానమంత్రి
దీన్: అరబ్బీ నమ్మకం
దుకాణం(పారసీ): కొట్టు, షాపు, అంగడి(మరాఠీ దుకాన, దుకాణ, పారసి దుకాన్
దుబారా/దుబారీ: (పారసీ): రెట్టింపు, రెండురెట్లు, అధికంగా ఖర్చుచేయటం
దుర్బిణి(పారసీ): టెలిస్కోప్, దూరదర్శిని
దుర్బీను, దుర్బిణి. ఓకువేసి చూడు look with a spy-glass.
దుశ్శాలువ: రెండు శాలువలు కప్పే ఒక గౌరవ పురస్కారం
దుహిలి: చిన్నహస్తాభరణం, బ్రేస్'లేట్ లాంటిది, మరాఠీ: దుహేరా, పారసీ దువాల: తోలుపట్టి
దోస్తానా(అరబ్బీ): స్నేహం
దోస్తీ(పారసీ): స్నేహం
దౌలత్తు(అరబ్బీ): సంపద

నకలు: (అరబ్బీ): కాపీ

నకీబు: చోపుదారి, ఎచ్చరికలు చెప్పే స్తోత్రపాఠకుడు, పారసి నకీబు

నగదు (పారసీ): సొమ్ము, క్యాష్

నగారా: అరబ్బీ నగారీ: పెద్ద వాయిద్య యంత్రం

నజరానా(అరబ్బీ): కానుక

నబీ: (అరబ్బీ, పారసీ) మతప్రవక్త

నమక్ హరామ్(పారసీ): నమ్మక ద్రోహి

నమక్(పారసీ): నమ్మకం

నమాజు: (పారసీ)

నమూనా (పారసీ): మచ్చుకు చూపించటం

నమోదు (పారసీ): చేర్చటం

నవాబ్:(అరబ్బీ): నవాబు, ప్రభువు

నసీబు(అరబ్బీ): అదృష్టం

నాజరు (అరబ్బీ): షరీఫ్

నాజూకు (పారసీ): సొగసైన

నాడా/నాలా(అరబ్బీ): గుర్రపు నాడా, బొందు

నాదారు(పారసీ): పేదరికం

నామర్దా: (పారసీ) చిన్నతనంగా అనిపించటం, అవమానం

నామోషీ/నామూషి (అరబ్బీ): తక్కువ, లోకువ కావటం

నారంగి (పారసీ): నారింజ, నారంగిలో 'న' లోపించి ఆరెంజి అయ్యింది

నాష్తా(పారసీ): ఉదయం తీసుకునే అల్పాహారం

నిఖా(అరబ్బీ) : వివాహం

నిఘా(పారసీ): వేగులు ప్రత్యేకంగా దృష్టిపెట్టి పరిక్షించటం

నిశానీ (హిందీ): చేవ్రాలు, వేలిముద్ర

నిషా(పారసీ): మత్తు

నౌకర్ (అరబ్బీ): సేవకుడు, పరిచారకుడు

నౌబత్ (పారసీ): ఒకవిధమైన డ్రమ్ము వాయిద్యం

పంజార: సుమత్రా ద్వీపంలో పజ్జార్ పట్టణం, అక్కడినుండి తెచ్చిన కర్పూరం పంజార

పంజు: ప్రకాశించే రత్నాలు పొదిగినది పారసి: పంజ్‌వజ్యోతి

పంట్లాం: ప్యాంటు, ఇంగ్లీషు : ప్యాంటలోన్, పోర్చుగీసు: పంతలోనా
పండువా: పశ్చిమ బెంగాల్లో ఒక పట్టణం, ప్రాచీనకవులు ఈ పట్టణాన్ని ప్రస్తావించారు.
పటాలము:(పోర్చుగీసు: బతాల్లియం) = బెటాలియన్
పత్తె (పారసీ): చిరునామా
పరంజా: గూడు, బొక్క, అడ్డకొయ్యని ఉంచే గోడ కన్నం, పరంజా, పరంజు, (పోర్చుగీసు ప్రాంష్)
పరగణా(పారసీ): జిల్లా
పరదా (పారసీ): తెర
పరాకు (మరాఠీ:పరాఖ్) ఉపేక్ష, నిర్లక్ష్యము
పర్వానా/ఫర్మానా (పారసీ): ఆజ్ఞాపత్రం
పలావు/పులావు(పారసీ): బిరియానీ లాంటి వంటకం
పసందు(పారసీ): సంతోషం, ఆమోదం
పహరా(పారసీ): కావలి
పాదిరి (పోర్చుగీసు పాద్రి): క్రీస్తు మతబోధకుడగు గురువు
పాయఖానా(పారసీ): మరుగుదొడ్డి
పాయిదా(అరబ్బీ): లాభం
పారసి: ఇండో ఇరేనియన్ భాషా కూటమికి చెందిన ఒక భాష-పార్సీ, పారసీ భాష
పింగాణీ పారసి:పింగాన్, ఒక విధమైన గాజు పాత్ర, తెల్లమట్టి పాత్ర, పల్లెరం, ఫింజాన్, చైనా మట్టిపాత్ర
పితూరి (అరబ్బీ): పథకరచన
పీపా: (పోర్చుగీసు పీపా) పీపాయ, పీపాయి కొయ్య చెక్కలతో పెద్ద మద్దెల రూపుగా నిర్మించిన పాత్ర
పీరు(పారసీ): గురువు, వృద్ధుడు, మార్గదర్శి
పీష్వా: మరాఠీ: ప్రధానమంత్రి
పుదీనా(పారసీ): పొదీనా మొక్క
పునాది (పారసీ): భూమిలోపల నిర్మించే ఇంటిపాదాలు
పేష్కర్: (పారసీ) రెవెన్యూ అధికారి
పేష్కస్: ప్రభువు పాలించటానికి భూమి ఇచ్చినందుకు జమీందార్లు చెల్లించిన మొత్తం
పైగంబర : (పారసీ=పైఘంబర్) మహమ్మదీయ మతప్రవక్త, స్వర్గం నుండి వచ్చినవాడు

పైజమా(అరబ్బీ): ఒక వస్త్ర విశేషం
పైమాయిషీ(అరబ్బీ): సర్వే చేయటం, అంచనావేయటం
పైల్మాన్/పహలవాన్(పారసీ): మొదటివాడు, ఉన్నతుడు, వస్తాదు, మల్లయోధుడు
ఫౌజ్‘దార్ (పారసీ): సైన్యాధికారి
ఫర్మానా(పారసీ): ఆజ్ఞాపత్రం
ఫర్మాయిషి(పారసీ) : ఆదేశం
ఫలానా(పారసీ) : ఆ వ్యక్తి లేదా ఆ వస్తువు, అది.
ఫసలు: (అరబ్బీ) : పంట
ఫిరంగి: పిరంగి, పీరెఅంగి, మందుగుండు దట్టించి ప్రయోగించే విధ్వంసకర యంత్రం
ఫిర్యాదీ (పారసీ): కేసు పెట్టడం
ఫిర్యాదీ(పారసీ = ఫర్యాది) : నేరారోపణ
ఫిర్యాదు(పారసీ) : కేసు
ఫైసల్: (అరబ్బీ) : సెటిల్‘మెంటు
ఫౌజు: పటాలము, మరాఠీ పౌజవదండు. పవుజు
బంకం వాకిలి(మరాఠీ) = తలవాకిలి
బంకు:(డచ్చి: బంకు=బెంచి, ఖజానా)కిళ్లీకొట్టు, తమలపాకుల అంగడి, మరాఠీ బంకా
బందరు (పారసీ): హార్బర్, రేవుపట్టణం
బందీ(పారసీ): పట్టుబడినవాడు
బందూకు: (అరబ్బీ) తుపాకీ
బందోబస్తు: (పారసీ): మేనేజిమెంట్
బక్షీ (పారసీ): జీతం చెల్లించే అధికారి
బక్షీసు (పారసీ): టిప్పు, లంచం, సేవకు తగిన ప్రతిఫలం
బజారు(పారసీ): మార్కెట్టు
బదనామ్(పారసీ): ఒక తిట్టు, చెడ్డపేరు
బదలా/బదలాయించు (అరబ్బీ): ప్రత్యామ్నాయం, మార్పు
బద్మాష్(పారసీ): చెడ్డవాడు
బరాబరి పారసి: బర్–ఆ–బరీ. క్రమశిక్షణలో ఉంచటం, సమానం చేయటం
బర్‘ఫీ(పారసీ): గోధుమపిండితో చేసే ఒక స్వీటు

బర్తరఫ్: (పారసీ): ఉద్వాసన చెప్పటం, సస్పెండ్ చేయటం, తొలగించటం

బహదూర్: (పారసీ) నాయకుడు, హీరో

బాకీ: (అరబ్బీ): తక్కిన, కడమ, చివరికి మిగిలింది

బాకీదారు (పారసీ): అప్పు పుయుచ్చుకున్నవాడు

బాకు(మరాఠీ) (మొలను దోపుకునే వంకీ కత్తి), మరాఠీ: బాక

బాగాయతి(పారసీ): తోటకు సంబంధించినది

బాగ్(పారసీ): తోట

బాగ్'వానా(పారసీ): తోటమాలి

బాజారు: విపణి వీధి, మరాఠీ బాజార/బార్ఝార = అంగడివీధి

బాజుబంద్(పారసీ): దండకడియానికి కట్టే రక్ష

బాతు: బాతువులు (పోర్చుగీసు పాతు) పొట్టిబాతు, బాపనబాతు=చక్రవాకం, చింకుబాతు, గూడబాతు

బాదామీ (పారసీ): బాదంపప్పు

బాదుషా(పారసీ=బాలూసాఇ) : పొరలుగా చుట్టిన అండాకారపు తీపిపదార్థం

బాద్'షా (పర్షియన్) రాజు, ప్రభువు

బాపతు(పారసీ): మాదిరిగా ఆవిధమైన

బారకాసు(పోర్చుగీసు) బుర్రాకాష్ = గుడిసె, గుడారం, డచ్చి బరక్ = పాక

బారెక్స్(అరబ్బీ): బారికేడ్లు(బర్రాక్స్)

బిడారము (మరాఠీ) దండు దిగడానికి(విడిదికి) వీలైన ఏర్పాటు, మరాఠీ: బిడార = ఇల్లు

బినామీ(పారసీ): మరొక వ్యక్తి పేరున

బిస్కోతు: (పోర్చుగీసు బిష్కోయిత్) బిస్కెట్లు

బీబమ్మ, బూబమ్మ, బీబి, బిబి, బిబ్బీ, మరాఠీ: బిబి=మహమ్మదీయ కన్య,

బీమా(పారసీ): ఇన్సూరెన్సు

;బుడతకీచు: (పోర్చుగీసు పొర్తుగీజ) పోర్తుగాల్ దేశ భాష. పురతకేశు పుడతకీసు–బుడతగీచు

బురుజు: (అరబ్బీ) కోట గోపురం

బుర్కా/బురాకీ(అరబ్బీ): ముసుగు

బుల్'బుల్ (పారసీ): బుల్'బుల్ పిట్ట

బేజారు(పారసీ): పేజారు, భయం
బేరీజు/బేరాజు(పారసీ): అంచనా
బేవకూఫ్(పారసీ): అమాయకుడు, విషయం తెలియని వాడు, పరిజ్ఞానం లేనివాడు
బేవార్స్(పారసీ): వెనకాముందు ఎవరూ లేనివాడు
బొంగు(పోర్చుగీసు బంబూ): ఎండిన లావుబోలు, వెదురు: వెదురుబొంగి
బొందిలి(మరాఠీ) (బొందిలి దేశం-బుందేల్ ఖండ్-నుండివచ్చినవారు-బొందిలీలు)
బొంబాయి: కిరోసిన్ తోడే గొట్టం వంటి పరికరం, కుళాయి (పోర్చుగీసు బొంబా)
బొత్తాము(పోర్చుగీసు బొత్తామ్): బత్తాసు, బుతాము, బొత్తాసు, బొత్తాయి, బొత్తాసు
బొప్పాయి(పోర్చుగీసు పపైయా) పపయ-పప్పాయ-పొప్పడ-పొప్పాయి-బొప్పర-బొప్పాసి- మదనానబ
భరోసా(పారసీ): భరవసా, హామీ ఇవ్వటం, మిక్కిలి విశ్వాసం
భేషు/భేషుగ్గా(పారసీ): మంచిగా, గొప్పగా
మకాం(అరబ్బీ): నివాసం
మక్కా (అరబ్బీ) : పుణ్యక్షేత్రం
మజా(పారసీ): ఆనందించటం
మజూరీ/ముజూరి(పారసీ): కూలీ, పనిచేసినందుకు ఇచ్చే సొమ్ము
మణేలా: 9 అంకె ఉన్న పేకముక్క, (పోర్చుగీసు మనిల్యా)
మతలబు(అరబ్బీ):ఏదైనా ఒక అంశం
మతాబు(పారసీ): దీపావళి బాణసంచాలో వెలుగులు చిమ్మే ఒక వస్తువు
మదీనా(అరబ్బీ)
మరమ్మత్తు (అరబ్బీ): రిపేరు, నాణ్యపరచు
మలాము (అరబ్బీ): ఆయింట్‘మెంట్
మల్లు(పారసీ): మలమల్లు, మెత్తని బట్ట
మసీదు(అరబ్బీ) ప్రార్థనాస్థలం
మసీదు(ముస్లింల ప్రార్థనామందిరం, పారసి: మస్‘జిద్,మసాజిద్ సజ్జాద్ = ఉపాసకుడు, సజ్జాద = పూజ.
మస్తీ(పారసీ): మదపుటేనుగుగ్
మస్తు(పారసీ): చాలినంత, సమృద్ధిగా
మస్తు(పారసీ): మత్తు

మహజర్: (అరబ్బీ): ఎక్కువమంది చేసే విన్నపం
మహమ్మదు: (అరబ్బీ)
మహలు(అరబ్బీ) రాజమందిరం
మహసూల్‘దార్ (పారసీ) : పన్ను వసూలుదారు
మాజీ(అరబ్బీ): పూర్వపు అధికారి,
మాదాగుడి: మరియమ్మగుడి, పోర్చుగీసు మాద్రి = క్రైస్తవ సన్యాసిని
మాఫీ: (పారసీ): మినహాయింపు, రద్దు
మామలా(అరబ్బీ): వ్యాపారం
మామూలు(అరబ్బీ): అతి సామాన్య విషయం, ప్రత్యేకత లేని అంశం
మాలిక్(అరబ్బీ): యజమాని
మాలిమి(అరబ్బీ): ఓడ నడిపే నావికుడు, ఓడ నడిపే నైపుణ్యం
మాలిమ్: (అరబ్బీ): అధికారి, వశం చేసుకోవటం
మాలీసు(పారసీ): మర్దనా
మాలు (అరబ్బీ): సామగ్రి
మావటీ (పారసీ): ఏనుగును నడిపించేవాడు
మాహే/మాహీ(పారసీ): మాసం, ఒక నెల
మినహా(పారసీ): మినహాయింపు
మిరాశీ: (పారసీ) ఎస్టేట్
మిరాశీదార్: ఎస్టేట్ కలిగినవాడు
మీనార్ (అరబ్బీ): స్తంభం
మీర్జా (అరబ్బీ): ప్రభువు,
ముకద్దమా/ముక్కద్దమే(అరబ్బీ): సంస్థానం
ముక్తియారు(అరబ్బీ): స్వేచ్ఛ కలిగిన సూపరింటెండెంట్
ముక్తియార్‘నామా(అరబ్బీ): పవర్ ఆఫ్ అటార్నీ
ముఖమల్లు(పారసీ) ముఖమల్లు, మొహమల్ గుడ్డ బొచ్చు బట్ట పారసి : మిళ్‘మల్
ముఖాభిల(అరబ్బీ): పోటీ
మునిసిఫ్(అరబ్బీ): న్యాయమూర్తి
మున్షీ: (అరబ్బీ) కవి, పండితుడు, అనువాదకుడు
మురబ్బా (పారసీ): పులవబెట్టి తయారు చేసిన ద్రవ్యం

ములాఖత్/మిలాకత్తు(పారసీ): చెప్పుకునేం/దుకు అవకాశం ఇవ్వటం, ఇంటర్వ్యూ
ముల్కీ(పారసీ): స్థానికుడు
ముల్లా: (పారసీ) : ఉపాధ్యాయుడు
ముసాఫిరి(అరబ్బీ): నిత్య యాత్రికుడు
మెలాన్: పుచ్చ, దోస, కర్బూజ లాంటి పండు(పోర్చుగీసు మెలామ్)
మేకు:గూటము–మరాఠీ 'మేఖ=గుంజ', పారసి మేఖ్=గూటం, డేరాలు, కట్టడానికి దిగవేసే మేకు
మేజా: బల్ల (పోర్చుగీసుపదం)
మేజువాణీ(అరబ్బీ): వినోద కార్యక్రమం
మేజోడు: పాదరక్షలు తొడిగేందుకు, లోపలి కాలికి వేసుకునే జోడు, (పోర్చుగీసు మేయష్)
మేత్రాణు: క్రైస్తవపీఠాదిపతి (పోర్చుగీసు పదం)
మేస్త్రి (పోర్చుగీసు) : పనివాళ్లమీద పెద్ద,
మైజారు: కట్టుకొంగు–చీరమొదటి కొంగు–మి జర్=ఇజార్= కొంగు అని దొణప్పగారు
మైదా(పారసీ): గోధుమపిండిలో మృదువైన భాగం
మైదాన(పారసీ): సమతలంగా ఉండటం, మైదానం ఖాళీ స్థలం
మైలు(పారసీ): దూరాన్ని కొలిచే ఒక కొలత, కిలో మీటరుకన్నా ఎక్కువ దూరం
మొగలాయీ(పారసీ): మొఘల్ జాతికి చెందినవాడు
మొలాము, మలాము, మోళము: వెండి లేదా బంగారపు పూత, మరాఠీ ములామా, ములమ్మా.
మొహరా(పారసీ): బంగారు నాణెం
మొంబత్తీ(పారసీ): కొవ్వొత్తి
మోజా: ముందు వైపు మెలిక కలిగిన పాదరక్ష
మోతీ(పారసీ): మంచి ముత్యం
మోతుబరి(అరబ్బీ): పెద్దమనిషి, భూస్వామి
మోర్చా(పారసీ): పటిష్టమైన
మోస్తరు: మాదిరి, విధము, రీతి, నమూనా (పోర్చుగీసు అమోస్త్ర)
మౌల్వీ (అరబ్బీ): మతపరమైన
యాది(పారసీ): జ్ఞాపకం,

రంగు(పారసీ): వర్ణం
రకము(అరబ్బీ): విధమైన
రద్దు(అరబ్బీ): ఉపసంహరించుకోబడటం
రవాణా (పారసీ): సామగ్రిని వేరొకచోటకు చేర్చు
రసీదు(పారసీ): ముట్టినట్టుగా ఇచ్చే కాగితం, రెసీట్
రహదారి(పారసీ): రాచమార్గం, పాస్‘పోర్ట్
రహీమా(అరబ్బీ): దేముడు
రాజీ(అరబ్బీ): అంగీకారం
రాజీనామా(పారసీ): వైదొలగుట
రావు: తొలుత మరాఠీ–మధ్య యుగాల్లో వెలమ దొరల బిరుదునామం మరాఠీ రావో = రాజు, ప్రభువు
రాస్తా(పారసీ): దారి,
రివాజు(అరబ్బీ): ఆచారం, అలవాటు
రిసాల్‘దార్ (పారసీ): ఆయుధాగార అధికారి
రీపర్లు (పోర్చుగీసు రీపా), పెంకులకింద ఉంచే సన్నని బద్దలు
రుజూ(అరబ్బీ): నిరూపణ
రుసుము(అరబ్బీ): వెల, ధర, ఫీజు,కమీషను
రూపారూపు(పారసీ) : ముఖాముఖీ (ఫేస్ టు ఫేస్)
రైత్(అరబ్బీ): రైతు
రొఖ్కం (అరబ్బీ): డబ్బు, నగదు
రోజా: (పారసీ) ఉపవాసం
రోజుగార్(అరబ్బీ): ఉద్యోగం
రోజూ(దినము, పారసి–రోజన్ = సూర్యుడు, పగలు, రోజ్ రోజ్–ప్రతిదినము)
లంగర్: నావను నిలపటానికి నీటిలోకి వేసేది
లకోటీ (పారసీ): పోస్టల్ కవరు
లఫంగీ(పారసీ): ప్రగల్భాలు పలికేవాడు, ఎచ్చులు పోయేవాడు
లాయక(అరబ్బీ): సంతోషం
లాలూ: (మరాఠీ–లాలా) : ఎరుపు
లాహిరి(పార్సీ) (సారా లాంటి మాదక ద్రవ్య సేవనం వలన కలిగే మత్తు,

పారసి లహ్‘ర్, లహర్)
లుంగీ(మరాఠీ) మొలను కట్టుకునే గళ్లగళ్ల వస్త్రం,
లుగుసాను(అరబ్బీ): నష్టం
లూటి: బాధ, మరాఠీ లూట్, లూటీ: కొల్లగొట్టటం
వకాల్త్ నామా(పారసీ): పవర్ ఆఫ్ అటార్నీ
వకీల్: (అరబ్బీ) న్యాయవాది
వగైరా(అరబ్బీ): మొదలగునవి
వజీర్: (అరబ్బీ) మంత్రి
వతను(అరబ్బీ): అలవాటుగా, రోజువారీగా, వతనుదార్ = వినియోగదారుడు
వరండా(పారసీ): చావడి
వళందు: (పోర్చుగీసు), ఒలందా- హోలండ్(డచ్చివారు) వళంద పాలెం మచిలీపట్టణంలో ఉంది.
వస్తాద(పారసీ): ఉస్తాద్, గొప్ప సంగీత విద్వాంసుడు
వహవా(పారసీ): మెచ్చుకోలు
వహి (మరాఠీ) రోజువారీ లెక్కలు వ్రాసే పుస్తకం,
వాపసు(పారసీ): తిరిగి ఇచ్చేయటం
వారసు(అరబ్బీ): చట్టపరమైన వారసత్వం, వారసుదార్, వారసుడు
వేలము (అరబ్బీ) ఏలము వేయు, వేలంపాట
శరము(పారసీ): సిగ్గు
శరాబు(పారసీ): మత్తుపానీయం
శర్బత్ (పారసీ): చల్లగా తాగే తియ్యని పానీయం
శహర్(పారసీ): నగరం
శాయ్యదా(అరబ్బీ): కులం
శాలువ(పారసీ): శాలువు, ఉత్తరీయంలా కప్పుకునేది, మరాఠీ: శాలూ,
శాహ(పారసీ):ప్రభువు
శాహజాద(పారసీ): రాకుమారుడు
శాహజాదీ(పారసీ): రాకుమార్తె
శాహబాసు(పారసీ): మెచ్చుకోలు, సెభాష్
శిరస్తేదార్ (పారసీ): రెవెన్యూ హెడ్ క్లర్క్

శేకదార్(పారసీ): గ్రామ రెవెన్యూ కలెక్టర్
షరాబు(అరబ్బీ): బ్యాంకులో క్యాషియర్, వెల కట్టేవాడు
షాదీ: (పారసీ) వివాహం
షికార్(పారసీ): వేట
షేక్ (అరబ్బీ): ప్రభువు, గురువు
సంగడి: (మరాఠీ:సంఘాడీ) వ్యాయామానికి ఉపయోగించే గుండు
సందుగు(అరబ్బీవసందూకా) చిన్న పెట్టె, సందుగుపెట్టె
సగ్గు:(పోర్చుగీసు) కర్రపెండలం గుజ్జుతో చేసిన ధాన్యం. సగ్గు బియ్యం. మరాఠీ సాబూదాణా
సనదు/సన్నదు(అరబ్బీ): అధికారికంగా ఇచ్చినట్టు తెలిపే ధృవపత్రం
సన్నాయి: పారసీ: షాహ్‘నాయి, జయకాహళ, యుద్ధకాహళ, నాగసరము
సఫాయి(పారసీ): పాలిషు చెయ్యటం
సబబు(అరబ్బీ): సరైనదేననటం
సబ్బు: జిడ్డును పోగొట్టే క్షార ద్రవ్యం, సబ్బిళ్ల (పోర్చుగీసు సబాను)
సమ్మాను (పోర్చుగీసు)(మూడు పలకల పడవ )
సరంజామా (పారసీ): వస్తు సముదాయం
సర్కార్(అరబ్బీ): అధికారి
సర్దార్(అరబ్బీ,పారసీ): అధికారి
సలహా (పారసీ): సలహా
సవా: (మరాఠీ) ఒకటింబావు, సవాలక్ష = లక్షా పాతికవేలు
సవారీ(పారసీ): అశ్వకుడు, గుర్రాన్ని తోలేవాడు, ప్రయాణికుడు
సహా(మరాఠీ: చక్రవర్తి, శహా=రాజు శాహాజీ తంజావూరునేలిన మరాఠీ రాజు
సాంబ్రాణి(పారసీ): సామ్రాణీ (మరాఠీ: సమరాణ) (ఉత్తమ జాతి గుర్రం, సమరాణ అనేది టర్కీ నగరం)
సాదరు(అరబ్బీ): ఇవ్వబడినది
సాదా(పారసీ): సామాన్యంగా ఉండటం, ఇం: సింపుల్
సాని(అరబ్బీ): గొప్పింటి స్త్రీ, దొరగారి భార్య=దొరసాని
సాపు(అరబ్బీ): స్వచ్ఛమైన
సాబూను(అరబ్బీ): సబ్బు

సార్జంటు(పోర్చుగీసు): సైన్యాధికారి
సాలు(పారసీ): ఒక సంవత్సరం
సాహెబా: (పారసీ): అధికారి
సాహెబా: గురువు
సితారా (పారసీ): సితార్
సిపాయీ(పారసీ): సైనికుడు
సిపారసు (పారసీ): అనుకూలంగా సూచించు
సిబ్బంది(అరబ్బీ): మందీమార్బలం
సిరస్తే(పారసీ): రెవెన్యూ విధి
సిర్కా(పారసీ): పుల్లని ద్రవం, వినెగర్
సిస్తు(పారసీ): పన్ను
సీయ్యం(పారసీ): మూడవది
సీరా(పారసీ): ద్రవపదార్థం, వ్రాయటానికి తయారు చేసిన రంగు ద్రవం
సీసీ(అరబ్బీ): సీసా, గ్లాస్ బాటిల్
సుంతీ: (అరబ్బీ)మహమ్మదీయ బాలుడికి చేసే ఒడుగు
సుపాణి: (మరాఠీ: సుపాణీ), శుభ్రమైన నీరు దిగిన మంచి ముత్యం, తేజస్వి
సుబా( పారసీ): జిల్లాలో ఒక ప్రాంతం
సుబేదార్(పారసీ): తాలూకా అధికారి
సుమారు(పారసీ): రమారమి
సురమా(పారసీ): కాటుక
సురూ(పారసీ): ప్రారంభించటం
సుల్తాన్ (పారసీ): రాజు
సుస్తీ(అరబ్బీ): అనారోగ్యం
సుస్తు(అరబ్బీ): సోమరితనం
సేబాసు: మెచ్చుకోలు మాట, (మరాఠీ: శాబాస, పారసీ: షహ్-బాష్)
సేరు(పారసీ): ఒక కొలత
సైతాన్(అరబ్బీ): దెయ్యం
సొగటాలు(మరాఠీ: సాగడీ) జూదం ఆడే గచ్చకాయలు, చింతపిక్కల్లాంటివి)
సోళాదొప్పి(మరాఠీ, షోలావపదారు, దోఫా అంటే దెబ్బలేదా ఎత్తు, పదహారెత్తుల

ఆట అయి ఉండొచ్చు)

హంగామా(పారసీ): తాత్కాలికంగా చేసే హడావిడి

హకీము(అరబ్బీ): గ్రామీణ వైద్యుడు

హక్కు(అరబ్బీ): సంక్రమించిన భాగం

హజం (అరబ్బీ) గొప్ప అకలి, జీర్ణశక్తి

హజారము(పారసి హాజిరాన్) ఆస్థానము, మొగసాల

హజారా (పారసీ): పెద్ద హాలు

హద్దు(మరాఠీ హద్ద) అవధి, మేర, పొలిమేర, అరబ్బీ: హద్ సరిహద్దు:(మరాఠీ సర్'హద్), మేర, పొలిమేర)

హబీసి(అరబ్బీ): అబిసీనియా దేశం

హర్'కార్ (పారసీ):: కొరియర్

హలువా/హల్వా(అరబ్బీ): ఒక రకం స్వీటు

హవా(అరబ్బీ): గాలి, ఆధిక్యత

హవాలా(అరబ్బీ): మాట నమ్మకం ఆధారంగా జరిగే లావాదేవీ

హవాల్ 'దార్ (పారసీ): సైన్యాధికారి

హవుసు(పారసీ): అందం

హవేలీ (పారసీ): పెద్ద ఇల్లు, విల్లా

హాజరు: (పార్సీ: హాజిర్) సన్నిధినుండు, సేవకు సిద్ధంగా ఉండు హాజిరీ = సభ్యులు, హుజ్రా: కొలువుకూటం

హార్మోనియం: ఆర్మాణి, ఆరిమాని (పోర్చుగీసు: ఆర్మోనీ): పియ్యానీ పెట్టె

హిమ్మత్(పారసీ): గర్వకారణమైన, ప్రతిష్ఠ

హుకుం(అరబ్బీ): ఆజ్ఞ

హుజూరు (అరబ్బీ): అయ్యా!

హుమాయి (మరాఠీ: హూమా) వాహనము

హురుముంజి(పారసీ జలసంధి తీరంలో గల ఒక పట్టణం నుండి వచ్చిన సుగంధ ద్రవ్యం

హైరాణా(అరబ్బీ): ఎక్కువ అలసిపోవటం



తెలుగులో అతిథి పదాలు Persian, Arabic & Portuguese Loan Words in Telugu

## Dr. G.V. Purnachand



## భాషా వెలుగుల పూర్ణచంద్రుడు
## డా॥ జి.వి. పూర్ణచందు

తెలుగు భాష మూలాలను తవ్వి వెలికితీసి, 'తెలుగే ప్రాచీనం' గ్రంథం ద్వారా కొనసాగవలసిన పరిశోధనలకు ఎన్నో ఆకరాలను అందించిన పరిశోధకుడు...

ప్రాచీన ఆఫ్రికన్ భాషలలో తెలుగు నుడులపై విశేష అధ్యయనం చేసి 'నైలు నుండి కృష్ణదాకా' గ్రంథం ద్వారా తెలుగు భాష ప్రాచీనతపై కొత్తవెలుగులు ప్రసరింపచేసిన విశ్లేషకుడు...

తెలుగు భాషోద్యమంలో నిర్మాణాత్మక పాత్రనిర్వహిస్తున్న కార్యకర్త... సాహితీవేత్త... డా॥ జి.వి. పూర్ణచందు శ్రమకోర్చి కూర్చిన విదేశీపదాల సంకలనం ఈ పుస్తకం!

గత నలభై యేళ్ళకాలంలో పూర్ణచందు 107 పుస్తకాలు వెలువ రించాడు. వివిధ పత్రికల్లో 34 శీర్షికలు నిర్వహించాడు. సంపాదకత్వం లేదా సహ సంపాదకత్వం వహించిన 24 ఉద్గ్రంథాలు ఆకరగ్రంథాలుగా ప్రసిద్ధి పొందాయి. అనేకసార్లు పునర్ముద్రణ పొందిన వైద్యగ్రంథాలు, తెలుగువారి ఆహారచరిత్ర గ్రంథాలు, భాషా పరిశోధనా గ్రంథాలు పూర్ణచందును బహుపార్శ్వీన శేముషీగుణ సంపన్నుణ్ణి చేశాయి.

"ముక్కాలు" కవితా సంపుటిని ఏడు భాషల్లో ఒకేసారి ప్రచురించి తనదైన నవ్యకవితారీతిని సృష్టించాడు పూర్ణచందు. తెలుగువారి ఆహారచరిత్రపై తొలిసారిగా ఆహారవేదం, తరతరాల తెలుగురుచులు లాంటి 12 విలువైన గ్రంథాలను వెలువరించాడు. సప్తసింధు, తెలుగుధీర గ్రంథాలు పరిశోధకుడిగా పూర్ణచందును చిరస్మరణీయుణ్ణి చేశాయి.

ప్రతిరోజూ తప్పనిసరిగా ఒక రచన చేయాల్సినంతగా 10 మాస, వార దిన పత్రికల్లో ప్రస్తుతం శీర్షికలు నిర్వహిస్తున్నాడు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం మరియు ప్రపంచ తెలుగు రచయితల మహాసభల ప్రధాన కార్యదర్శిగా అనితర సాధ్యమైన రీతిలో కార్యక్రమాలు నిర్వహించాడు. క్షణం తీరిక లేకుండా, అలుపెరుగని రీతిలో పనిచేసే పూర్ణచందు తెలుగుపున్నమిచంద్రుడిలా సార్థక నామధేయి. సాహితీవేత్తగా, సాహితీ సేవకుడిగా పూర్ణచందు కృషి చిరకాలం నిలిచిపోతుంది.

గుత్తికొండ సుబ్బారావు,
అధ్యక్షుడు, శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్టు,

